శ్రీ శారదాంబాయై నమః




శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

ప్లవంగ - మాఘ ఫాల్గుణములు

సంపుటము 56 సంచిక 6



సంపాదకుడు

కాకరపర్తి కృష్ణశాస్త్రి.

శ్రీ శారదాంబాయై నమః




# శ్రీ

# ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక

## ప్లవంగ - మాఘ ఫాల్గుణములు

సంపుటము 56 సంచిక 6



సంపాదకుడు

కవికంఠీరవ, కవిమూర్ధన్య, ప్రౌఢకవిచంద్ర, విద్వత్కవివర,

బ్రాహ్మీభూషణ కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంవత్సరమునకు చందా రు 3/-

విడిప్రతి 0-60 పైసలు

# ఆంధ్రసాహిత్యపరిషత్తు

ప్రతిష్ఠాపకులు:

ఆంధ్రభోజ, మహారాజ,

శ్రీ శ్రీ శ్రీ రావు వేంకటకుమార మహీపతి సూర్యారావు బహద్దరువారు సి. బి. ఇ., డి. లిట్, పిఠాపురము మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ వేంకటగిరి మహారాజావారు.

శ్రీ శ్రీ శ్రీ బొబ్బిలి మహారాజావారు.

వ్యవస్థాపకులు:

శ్రీ జయంతి రామయ్యగారు

ఉద్ధారకులు:

శ్రీ రాజా వేంకటాద్రి అప్పారావు బహద్దరువారు,
జమీందారు, ఉయ్యూరు.

# ఆంధ్రసాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

## కా కి నా డ

అధ్యక్షులు

విమర్శకాగ్రేసర ఐతిహాసికసమ్రాట్

శ్రీ బండారు తమ్మయ్యగారు

ప్రధానకార్యదర్శి, కోశాధికారి

అభినవభోజ

శ్రీ దంటు భాస్కరరావుగారు

సహాయ కార్యదర్శి

కవిశిరోమణి, ఉభయభాషాప్రవీణ (A)

శ్రీ దువ్వూరి సూర్యనారాయణశాస్త్రిగారు

కార్యనిర్వాహక సభ్యులు

1. శ్రీ కోకా శివనాథశాస్త్రిగారు
2. బాలవ్యాస, శ్రీ వారణాసి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు
3. భాషాప్రవీణ, వ్యాకరణ విద్యాప్రవీణ
   శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు
4. కవిసార్వభౌమ, ప్రౌఢకవిచంద్ర
   శ్రీ కాకరపర్తి కృష్ణశాస్త్రిగారు
5. శ్రీ కుందూరి ఈశ్వరదత్తుగారు, బి. ఏ;
6. శ్రీ జయంతి బుచ్చిరామశర్మగారు
7. శ్రీ దామెర రాజగోపాలరావుగారు, బి. ఏ;
8. శ్రీ వేదుల రామచంద్రకీర్తిగారు, ఎమ్. ఏ; (ఆనర్సు)
9. సాహిత్యవిద్యాప్రవీణ, ఉభయభాషాప్రవీణ
   శ్రీ ఓలేటి వెంకటసుబ్బరాయశాస్త్రిగారు
10. శ్రీ కావలి శ్రీరామమూర్తిగారు, బి. ఏ., బి. ఎల్;
11. శ్రీ నరసింహదేవర కృష్ణశాస్త్రిగారు

# విషయసూచిక

ప్లవంగ * * * మాఘఫాల్గుణములు

సంపుటము ౫౬. సంచిక ౬.

# శిశిరర్తుః

(మాఘ ఫాల్గునౌ)

శ్లో. న చందనం చన్ద్రమరీచిశీతలం
న హర్మ్యపృష్టం శరదిందునిర్మలం
న వాయవ స్సాన్ద్రతుషారశీతలా
జనస్య చిత్తం రమయన్తి సాంప్రతమ్.

శ్లో. పయోధరైః కుంకుమరాగపింజరై
స్సుఖోపసేవ్యై ర్నవయౌవనోష్మభిః
విలాసినీభిః పరిపీడితోరస
స్స్వపన్తి శీతం పరిభూయ కామినః.

శ్లో. అపగతమదరాగా యోషిదేకా ప్రభాతే
కృతనిబిడకుచాగ్రా పత్యు రాలింగనేన
ప్రియతమపరిభుక్తం వీక్షమాణా స్వదేహం
వ్రజతి శయనవాసా ద్వాస మన్య ద్వసంతీ.

శ్లో. అగరుసురభిధూపామోదితం కేశపాశం
గళితకుసుమమాలం తన్వతీ కుంచితాగ్రం
త్యజతి గురునితంబా నిమ్నమధ్యావసానా
ఉషసి శయన మన్యా కామినీ చారుశోభామ్.

శ్లో. ప్రచురగుడవికార స్స్వాదుశాలీక్షురమ్యః
ప్రబలసురతకేళి ర్జాతకందర్పదర్పః
ప్రియజనరహితానాం చిత్తసంతాపహేతు
శ్శిశిరసమయ ఏష శ్రేయసే వో ఒస్తు నిత్యమ్.

(మహాకవి కాళిదాసః)



# బ్రహ్మమిత్ర ఇందీవరాక్షుల సంవాదము

శ్రీ అయ్యగారి నరసింహమూర్తి.

ఈ సంవాదము అల్లసానిపెద్దన రచించిన 'స్వారోచిషమనుసంభవ'మను ప్రబంధమునందలి పంచమాశ్వాసములోనిది. బ్రహ్మమిత్రుఁడొక యాయుర్వేదశాస్త్రోపాధ్యాయుఁడు. ఇందీవరాక్షుఁడు నలనాభాహ్వయుఁ డను నొకగంధర్వుని కుమారుఁడు. స్వారోచితల్లికిఁ దోఁబుట్టినవాఁడు. మనోరమకుఁ దండ్రి. ఇందీవరాక్షుఁడు తన రాక్షసజన్మకుఁ గారణమైనవిద్యాభ్యాసవిషయమును జెప్పుటయే యీసంవాదము. ఈవృత్తాంతమువలన నానాటి విద్యాభ్యాస మెంత కట్టుదిట్టమైన స్థితిలో నుండెడిదో గురుశిష్యులకుఁ గలసంబంధ మెంతదృఢతరముగా నుండెడిదో, గురువులు డబ్బుకక్కుర్తికై విద్య నమ్మక యెంతటిసత్త్వస్థితితో నుండెడివారో తెలియపరచుటయే ప్రస్తుతరచనోద్దేశము.

"కలఁ డుల్లోకయశఃపురంధ్రిజగతిన్ గంధర్వవంశమ్మునన్
నలనాభాహ్వయుఁడే తదీయతనయుం డన్ బ్రహ్మమిత్రుండు శి
ష్యులకుం గంటను వత్తిపెట్టుకుని యాయుర్వేద మోరంతప్రొ
ద్దుల చెప్పన్ వినుచుండి మానసమునందుం దజ్జిఘృక్షారతిన్."

ఆయుర్వేదశాస్త్రోపాధ్యాయుఁ డగుబ్రహ్మమిత్రుఁడు ల్లోకయశఃపురంధ్రీవంతుఁడు. అనఁగా లోకాతీతమైన యశఃకాంత నిల్లాలుగాఁ బడసినవాఁడు. అయినను ధనాకాంక్షలేనివాఁడు. అంతేకాక తనశిష్యులకు శాస్త్రమును గంటను వత్తి నిడుకొని ఓరంతప్రొద్దులదనుకఁ జెప్పువాఁడు. ఇక శిష్యులును గాలక్షేపార్థమునకో పరపతిపెంచుకొనుటకో వచ్చినవారు గాక గురువు చెప్పెడిపాఠములను జిఘృక్షారతితో వినఁగల వినయసంపన్నులు. అట్టియిచ్ఛ గలిగినవారికే ఆనాఁడు ఏశాస్త్రమునైన నేర్పెడివారు. కానిచో నెంతటివారైనను ఏమి ఈయ నిచ్చగించినను విద్యాదానము చేసెడివారు. రావలసినకీర్తి లభించినది

గదా యిక నెదురు లేదనుదృష్టిలో ధనసంపాదనమే ప్రధానలక్ష్యముగాఁ గలిగినవారు కారానాటి పెక్కురు గురువులు.

విశేషమైన కీర్తిప్రతిష్ఠల నార్జించిన బ్రహ్మమిత్రుని కడ కొకనాఁడు నలనాభుని కుమారుఁడైన ఇందీవరాక్షుఁ డాయుర్వేదమును నేర్చుకొనవలె ననెడికౌతూహలముతో మునివరుఁజేరి భక్తి నమస్కరించి "చెప్పవే నాకు నీవిద్య శిష్యకోటితోడఁ గూడఁగ నేకృతార్థుఁడ నగుదు"నని ప్రార్థించినాఁడు. నేటివ్యక్తులవలె బ్రహ్మమిత్రుఁడు నమస్కారముల కుబ్బితబ్బిబ్బైనవాఁడు కాఁడు. వచ్చినవానిని శిష్యునిగా గైకొనక "నటవిటగాయకగణికాకుటిలవచశ్శ్రీధురసము గ్రోలెడిచెవికిం గటు వీశాస్త్రము వల దిచ్చట నిను జదివింపకున్న జరుగదె మాకున్" అని అపహాసించినాఁడు.

గురువు గ్రాసవాసములకుఁ గొదువలేదని గర్వించి పలికినపలుకులు గావివి. దేనినైన నిచ్చునపుడు ముందుగాఁ బాత్రాపాత్రములను గుర్తెఱింగి యీయవలెను. లేకున్నచో నప్పటికి హాని కలుగకున్నను ఆతరువాత ఉపద్రవము తప్పక గలిగితీరును. ఎట్లన "పాత్రాపాత్రవివేకోఽస్తి ధేనుపన్నగయో రివ తృణాత్సంజాయతే క్షీరం క్షీరాత్ సంజాయతే విషం." కనుకనే బ్రహ్మమిత్రుఁడు జంకుగొంకులు లేక 'నటవిటగాయకగణికలతోఁ గాలము గడుపు నీవంటివాని కిట్టియుత్తమ విద్య గఱపుట తగదు పొమ్మ'నినాఁడు. అయినను పోక ఇందీవరాక్షుఁడు "అనఁగ నేనట్టివాఁడ గా ననఘచరిత! ఇంచుకించుక మీ వంటి మెఱుకగలుగు పెద్దవారల శిక్షలఁ బెరిగినాఁడ" శిష్యునిగా నవధరింపుమ'నినాఁడు. దానికిం గొంచెముగా బ్రహ్మమిత్రుఁడు కినుక వహించి 'ధనరాజ్యగమామదమున కను గానని నిన్ను శిష్యుగాఁ గైకొనుకంటె నేరమి గలదే నను గనలించుకఁ బ్రేలకిఁక బోకాలు మ'నినాఁడు. ధనరాజ్యగమామదమునఁ గను గానని వానిని శిష్యునిగా గ్రహించుట

యే పెద్దనేరమి యనినాఁడు. కనుక నిట రెండవపలుకునకుఁ దావు లేదు. కనుకనే పొమ్మనినాఁడు. విద్యార్థికి మొదట నుండవలసినది వినయము. రెండవది తనవిద్యయందు గౌరవము. నేర్చుకొనవలె ననెడి ఆసక్తి పట్టుదల యుండవలెను. ఇందు వినయము లేనివారికి విద్య నేర్పుటయే గొప్పతప్పిదము. ఈరోజులలో వినయము విద్యయందాసక్తి లేనివారికి ధనము బలుకుబడులమూలమున ననాయాసముగ విద్యాసంస్థలలోఁ బ్రవేశము లభించుటవలననే విద్యారంగములోఁ జీటికిమాటికి నలజడులు బయలుదేరి యెల్లరకును నొక తీరనిసమస్యయైపోయినది.

గురువు తిరస్కరించినను ఇందీవరాక్షుఁడు వెనుదిరిగి పోక 'ద్వేష్టి గతాయుశ్చ చికిత్సకమ్మ'ను (ఆయువుతీరినవాఁడు వైద్యుని ద్వేషించును). సూక్తినిఁ దలఁచి కోపమును బయల్పడనీయక "నీవు సదివింతు వనుచు నిన్నియును విడచి బిచ్చమెత్తంగరాదు గా జేలతవసి కడవ నాడకు చాలు నీగొడవ యేలవెజ్జుదనమేల" యని యనినాఁడు. (నీవు సదివింతువు- ఇట చకారమునకు సకారము. ఇది ఈసడింపుగా బలికినమాట. ఇట్లాడుట విద్యార్థుల సహజలక్షణము.) పైకి 'ధీమాగా' అట్లనినను ఇందీవరాక్షునకు మదిలో లజ్జ పొడమినదట. పొడమి మనసున,

"కంటే బ్రాహ్మణు డెన్నికాఁడు లరచెన్ గర్వించి వీ రెల్ల నా
కంటెం బాత్రులె విద్య కెట్లు నిది నే గైకొందు నంచున్" అని తలఁచి

పట్టుదల గలిగి శాంబరీవిద్యాప్రభావముచేఁ గపటాంతేవాసియై శిష్యులతోఁ జేరి యెనిమిది నెలలలో "కాయబాలగ్రహోర్ధ్వకాంగములు నాల్గు శల్యదంష్ట్రాజరావృక్షసంజ్ఞ నాల్గు నైనయష్టాంగకముల తావులను నేర్చుకొనినాఁడు. ఈరీతిగా స్వల్పవ్యవధిలో వైద్యమును క్షుణ్ణముగ నేర్చుకొని మాయావేషమును దిగవిడచి విద్యనేర్చితి ననిన యహంకారముతో గురువుకుం జేరి యీవిధముగఁ బలికినాఁడు.

"తండ్రీ నాకు ననుగ్రహింపఁగదె వైద్యం బంచు ప్రార్థించినన్
గండ్రిల్ గా నటులాడి ధిక్కృతులఁ బోకాల్మంటి వోహోమదిం
దీండ్రిల్ గల్గినవారి నేకరణి నేనిన్ విద్య రాకుండనే
గుండాడాచిన పెండ్లి యేమిటికిఁ జిక్కు౦ కష్టముప్టింపచా."

ఇందీవరాక్షు డర్థియై వచ్చినప్పుడు బ్రహ్మమిత్రుడు విద్యను జెప్ప నిచ్ఛగింపక 'పౌకాలు(పొమ్ము) మనినాఁడు. శాంబరీవిద్యాబలముచే వైద్యము నేర్చి మాటకుమాట బదులు చెప్పవచ్చినటుల 'పౌకాలు' మనుశబ్దప్రయోగమునుబట్టి తెలియుచున్నది. ఇక నీ యర్థాంతరన్యాసవాక్యము ఇందీవరుని నిర్లక్ష్యమును దృణీకారభావమును జక్కఁగా వెల్లడిచేయుచున్నది.

మాయచే విద్యను నేర్చుటయే కాక నిర్లక్ష్యముగా లఘుమార్గమున మాటాడినశిష్యుని పలుకులు విని సంతనే గురువునకు మితిలేని యాగ్రహము వచ్చినది. ఆసమయమున బ్రహ్మమిత్రుని యాకారమును గన్నులకుఁ గట్టినటుల పెద్దనామాత్యుఁడు మాటలమూలమున చేష్టలను జూపించినాఁడు.అహంకారము దెబ్బతినిన ప్రతివ్యక్తియు నిట్లే యుండుననుట స్వభావోక్తియే యైనను నది కవితారూపమున వెలువడుట కతన బఠితలకు శ్రోతలకు నమందానందమును గూర్చుచున్నది. ఇట వాడినఛందమును సందర్భమునకుఁ దగియే యున్నది.

అనిన౦ గన్నులు జేవురింప నధరం బల్లాడ వేల్లత్పునః
పునరుద్యద్భ్రుకుటీభుజంగయుగళీపూత్కారఘోరానిలం
బన నార్పుల్ నిగుడన్ లలాటఫలకం బందంద ఘర్మాంబువుల్
చినుక౦ గంతుదిద్ధృక్షురూక్ష నయనజ్యోతీకరాళధ్వనిన్.

వ. జటిలుండు గిటకిటం బండ్లుకొఱికి హుమ్మని కటమ్ము లదుర ముకుఁబుటమ్ములు నటింపఁ గటకటా! కుటిలాత్మా! యటమటమ్మున విద్యగొనుటయుంగాక గుటగుటలు గురువుతోనా యని (టంకారము

పరుషము. టకారాన్వ త్తి కోపాతిశయమును సూచించుచున్నది.) కక పాలలోనిబూది గైకొని మమ్ము వంచించి విద్య నేర్చి యంతలోఁ జోక యపహసించితివి గాన నసురుండవై పిశితాశనముం గొని భూమిపై వసింపు మని ఆతనిపైఁ జల్లినాఁడు. దానితో నిందీవరాక్షునిమత్తు వదలినది. గుండె ఝల్లుమన కల్లువడి (నిశ్చేష్టతను బొంది) మునితల్లజుని పదపల్లవంబులఁ ద్రెళ్లిపడి,

"నా యజ్ఞానము సైచి సంయమివరేణ్యా కావవే రాక్షసుం
డై యే నెట్లు భరించువాడ దురితం బయ్యో నృమాంసంబు కూ
డై యే నెట్లు భుజించువాడ నుదరం బార్ద్రాంతరంగుండ వై
యో యయ్యా దయసేయవే యవధియే పోవంగ దే హింసకున్."

అని గురువును బ్రార్థించినాఁడు.

ఈపద్యమును వంచనచేసి విద్య నేర్చి యహంకారముతో గురువుకడ పల్కినపద్యమును బోల్చి చూచినచో మద మేవిధముగ వృద్ధి చెంది శాపముచే సంపూర్ణముగా క్షాళిత మైపోయినదో చక్కగాఁ దెలియఁగలదు.

పద్యములు రెండును శార్దూలములే యైనను మొదటిదానిలో నౌద్ధత్యమును, రెండవదానిలో నిర్మలమైన మనసునందలి దైన్యము చక్కగాగోచరించును.(బిందుపూర్వక 'డ'కారప్రాసతో తీండ్రముగాగండ్రలుగాఁ బలికినపలుకులు మొదటిని శాపాంతమున పాదప్రథమాక్షరములు నిఘదలై సుకరప్రాసతోఁ గూడి ఆతని వేడికోలును వ్యక్తము చేయుచున్నవి.

ఇందీవరాక్షుని మనసు శాపయుచే క్షాళన చేయఁబడినది. అటుపై జ్ఞానోదయ మైనది. కనుకనే పాదములపైఁ బడి శాపమున కొకయవధిని కల్పింపు మని వేడుకొనినాడు.

గురు వనఁగా నజ్ఞానమును బోఁగొట్టువాఁ డని యర్థము. విద్య నేర్చియు తాఁ బట్టినకుందేటికి మూడేకాళ్లనురీతిగా నుండువారివలె

గాక యుక్తాయుక్తములను ధర్మాధర్మములను నెఱింగి ప్రవర్తింపఁగలిగినవాఁడు బ్రహ్మమిత్రుఁడు. ప్రస్తుతపువారివలె మొండిగనో ఇతరుల యభిప్రాయానుగుణముగనో ప్రవర్తిల్లువాడు గాడు. కనుక నే శిష్యుని మనోనైర్మల్యమును గుర్తెఱింగి వత్సలభావముతో శిష్యుని తనహస్తములతో లేవదీసి భద్రముగా శాపాంతమును దెలియఁజేసినాఁడు.

"అనిపఁ బ్రసన్నుఁడై ముని కరాబ్జములన్ ననునెత్తి వత్సమత్సనిశిత శాపశూలహతి సుక్కితి గానికఁ గొన్నినాళ్లపై దనయను మింగబోయి యొకధన్యుని దివ్యశరార్చిఁ జేర్చి వేకనిమెదు భద్రమౌన్న.................

ఇందలి 'వత్స'శబ్దము బ్రహ్మమిత్రుని దయాగుణమునకుఁ బరసీమ. చేసినతప్పునకుఁ దగినదండన శిష్యునకు లభించి యథార్థమగు హృదయపరివర్తనము వచ్చినది. గురువు పరేంగితజ్ఞుఁడగుటచే నాభావమును గ్రహించి స్వహస్తములతో నాతనిని లేవనెత్తి శాపాంతరీతినిఁ దెలిపినాఁడు. ఇట్టియనుకంప గురువులకు శిష్యులపై నుండవలెను.

విద్య నేర్చుటగాని నేర్పుటగాని జ్ఞానసముపార్జనకే. విద్యవలన వినయము లేక యహంకార మభివృద్ధియైనచో నదివిద్య కాఁజాలదు. శిష్యునిగా నొకనిని గ్రహించుటకు ముందు గురు వాతని మానసికాభిరుచులను పాత్రాపాత్రములను విచారించి విద్యను నేర్పవలెను గాని తనకడ ఆవిద్య లేదనిగాని ధనమువచ్చునుగదా యనిగాని యేదియో యొకదానిని నేర్పకూడదు. పాత్రాపాత్రముల నెఱుంగక నేర్పినచో నది పామునకు పాలుపోసి పెంచినభంగి యొకపుడు వేపచెట్టునకు పంచదార పోసి పెంచినభంగి వేఱొకతఱి జరుగురు గాని సత్ఫలితము గనఁబడదు. యోగ్యతాయోగ్యతలను గుర్తెఱుంగక యెల్లరకును విద్య చెప్పయత్నించుట ప్రస్తుతపుటలజడులకు కారణమగుచున్నది. శిష్యుఁ

డొకపరి తెలిసిగాని తెలియకగాని యొకతప్పును జేసి తదుపరి పశ్చా త్తాపము చెందినయెడల వానిని వత్సలభావముతోఁ గనికరించి ఆద రించు నేర్పు ఓర్పు గురువున కుండవలెను. తగియున్నచో ఉచితరీతిని దగుదండన విధింపవలెను. సద్గురువుల కమిత మగుధనవాంఛ యుండ రాదు.

విద్యార్థికి మొదట వినయము తదుపరి తనగురువునందు తాను నేర్చుకొ నెడివిద్యయం దత్యంతపూజ్యభావము, ఆసక్తి, పట్టుదలతోఁ బాటు ఆత్మవిశ్వాసము ఆత్మగౌరవము ఉండవలెను. ఇట్లుండిననాఁడే విద్య కొకపరమార్థము, ఉపాధ్యాయున కొకగౌరవము, శిష్యున కొక యున్నతమార్గము లభించును. అట్టిపరిణామము కలుగనంతవఱకు విద్యావిషయమై యెన్ని యుపన్యాసములు గాని, ఎట్టిమార్పులు (Rules and Regulations) గాని యున్నతపరిమాణములకు, క్రమ శిక్షణకు దోహదకారులు కానేరవు.



# గాధేయచరితమ్—ప్రథమసర్గః

శ్రీ దురిశేటి వేంకటరామాచార్యః

శ్లో. శ్రీమా నాసీ ద్విధేః పుత్రః కుశో నామ మహీపతిః
మూర్ధాభిషి క్తమూర్ధన్యో మరుత్వాన్ మరుతా మివ.

శ్లో. యః ప్రతాపేన తపనో దయావర్షేణ వారిదః
చంద్రమా రంజకత్వేన బుద్ధ్యా చాసీ ద్బృహస్పతిః.

శ్లో. సామాదిభి రుపాయై ర్యశ్చతుర్భి స్సహితో వశీ
సాయుధై ర్బాహుభి ర్యుక్త శ్చతుర్భుజ ఇవాపరః.

శ్లో. తిస్రః శక్తీ రివ ప్రాప్య దృశో యః ఫాలలోచనః
వేదజ్ఞత్వా త్పితై వాసీ త్పుత్రే పితరి వాంతరః.

శ్లో. విరాజ స్తస్య మహతః కుశనాభః సుతో ఽజని
బాహ్యై స్సద్గుణవృత్తై ర్యః పితరం నితరాం వృతః.

శ్లో. యం రాజాన మనుప్రాప్య భర్తారం పితరం యథా
అభూ ద్రాజన్వతీ పృథ్వీ ప్రజాః స్వస్థా శ్చ సర్వథా.

శ్లో. యే నేష్ట్వా యాయజూకేన ప్రీణితా మరుతో ఽఖిలాః
యస్మై స్నిహ్యతి లోకో ఽయం సహభూతై శ్చరాచరైః.

శ్లో. తస్య గాధి ర్మహాగాధసత్త్వ స్సత్త్వగుణాశ్రితః
జాత స్సుత స్స పూతో ఽభూ త్క్రతా వివ హుతాశనః.

శ్లో. యస్మా త్ప్రచండదోర్దండమండలాగ్రేణ మండితాత్
ఖండనే ఖండితాఖండయశసో ఽబిభయు ర్ద్విషః.

శ్లో. యస్య ప్రతాపా చ్ఛత్రూణాం సమ్మిమీలుః ప్రియాదృశః
యస్మి న్ప్రసాదసుముఖే హృష్టే స్వస్త్రీ దృగుత్పలే.

శ్లో. పితృపైతామహం గోత్రం వర్ధయన్ తత్సుతో ఽజని
విశ్వామిత్రో విశ్వమిత్రో ఽమిత్రో దుశ్చేతసాం భృశమ్.

శ్లో. భవిష్య ద్బ్రాహ్మసంప త్తిచిహ్నా రేఖాభి రంచితే
తత్కరే స్ఫారమందారసుకుమారారుణప్రభే.

శ్లో. వర్చస్వి తస్య వదనం సమా దీర్ఘా చ నాసికా
దరస్మేరే స్ఫురత్తారే దృశౌ వలియుతాంబుజే.

శ్లో. తేజస్వినస్తస్య జనిః కుమారస్యార్భకస్య చ
కంపయామాస దంభోళిధారాణి శ్శైలశాసినమ్.

శ్లో. సవ్యాపసవ్యనేత్రే తే మేనకారంభయోః స్వమమ్
పస్పందాతే యథా మందవాతేన చలితోత్పలే.

శ్లో. అయః కఠోరపృథ్వీభృత్పక్షచ్ఛేదేఽప్యకుంఠితం
అకస్మాత్కుంఠితం వజ్రం సంచచాలాప్యరోగిణః.

శ్లో. పూతవైదికధర్మస్య దృఢదృష్టాంతసిద్ధితః
తుష్టః పంచముఖోత్పన్నో విభో ర్వేదసముచ్చయః.

శ్లో. మాతుః పితుః ప్రయత్నాచ్చ పుపోషావయవాని సః
ప్రావృషః కర్షకస్యేవ సుక్షేత్రే కలమాంకురః.

(సశేషమ్)



శ్లో. వర్చస్వి తస్య వదనం సమా దీర్ఘా చ నాసికా
దరస్మేరే స్ఫురత్తారే దృశౌ వలియుతాంబుజే.

శ్లో. తేజస్వినస్తస్య జనిః కుమారస్యార్భకస్య చ
కంపయామాస దంభోళిధారాద్రి శ్శైలశాసినమ్.

శ్లో. సవ్యాపసవ్యనేత్రే తే! మేనకారంభయో స్సమమ్
పస్పందాతే యథా మందవాతేన చలితోత్పలే.

శ్లో. అయః కఠోరవృద్ధీభ్య త్సత్యచ్ఛేదేఽప్యకుంఠితం
అకస్మాత్కుంఠితం వజ్రం సంచచాలాప్యరోగణః.

శ్లో. పూతవైదికధర్మస్య దృఢదృష్టాంతసిద్ధితః
తుష్టః పంచముఖోత్పన్నో విభో ర్వేదసముచ్చయః.

శ్లో. మాతుః పితుః ప్రయత్నాచ్ఛ పుపోషావయవాని సః
ప్రావృషః కర్షకస్యేవ సుక్షేత్రే కలమాంకురః.

(సశేషమ్)



# కొఱవి గోపరాజకవి కాలము

శ్రీ చేకుమళ్ల కామేశ్వర రావు.

సింహాసన ద్వాత్రింశిక యను తెలుగుకథల పద్యకావ్యమును కొఱవి గోపరాజకవి వ్రాసినాడు. అదిలో నాకవి యింటిపేరును గుఱించియె కొంత తగాదా యుండెడిది. కందుకూరి వీరేశలింగకవి గోపరాజుయొక్క యింటిపేరు [1]'కోవెల' యనినాడు. చాగంటి శేషయ్యగారు [2] 'కోవలె' యని చూచినట్లుగా గు ర్తున్నదని వ్రాసినారు. కాని యాగ్రంథమునకు మంచిప్రతి యొకటి లభింపగా, నతని యింటిపేరు [3]'కొఱవి' యని నిర్ణయ మైనది. కొఱవి యనుగ్రామము తెలంగాణములోని వరంగల్ జిల్లాలో నున్నది.

మొదటిలో వీరేశలింగకవి కొఱవి గోపరాజు క్రీ. శ. 1700 ప్రాంతపువాఁ డని [4]యభిప్రాయపడెను. పిమ్మట నాయన గోపరాజకవి పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవిని [5]స్తుతించినట్లుగాఁ జేర్కొనెను. సింహాసనద్వాత్రింశిక పీఠికాకారు లాకవి [6]పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని స్తుతించుటచేత నతనిపిమ్మటవాఁ డనిరి. చాగంటి శేషయ్యగారు[7] కూడ కడపటికి నట్లే భావించి కొఱవి గోపరాజు క్రీ. శ. 1430–90 వా డని నిర్ణయించిరి.

వీరేశలింగకవి యీ క్రిందిపాఠమును [8]తన గ్రంథములో నిచ్చినాడు.

---

1. ఆంధ్రకవుల చరిత్ర (1899) పుట 411.
2. ఆంధ్రకవి తరంగిణి సంపుటము 6, పుట 152.
3. ఆంధ్రసాహిత్యపరిషత్తు (కాకినాడ)వారి సింహాసనద్వాత్రింశిక 1936.
4. ఆంధ్రకవుల చరిత్రము- (1899) పుట 412.
5. ఆంధ్రకవుల చరిత్రము- మొదటిభాగము (1917) పుట 303.
6. సింహాసనద్వాత్రింశిక పీఠిక (1936) పుట 7.
7. ఆంధ్రకవి తరంగిణి సంపుటము 6 పుట 159.
8. ఆంధ్రకవుల చరిత్రము- మొదటిభాగము (1917) పుట 303.

చ. అనఘు హుళక్కి భాస్కరు మహామతిఁ బిల్లలమఱ్ఱి పెద్దిరా
జును చినవీరరాజు గవిసోమునిఁ దిక్కనసోమయాజిఁ గే
తనకవి రంగనాథు నుచితజ్ఞుని నెఱ్ఱన, నాచిరాజు సో
మన సమరేశ్వరుం దలఁతు మత్కులచంద్రుల సత్కవీంద్రులన్.

శుద్ధప్రతిలోఁ "బిల్లలమఱ్ఱి వీరశాజును, ఘను నాగరాజు" నని మాత్రమె యున్నది. కాలనిర్ణయమునకు ననుకూలముగా దానిని "పిల్లలమఱ్ఱి పెద్దిరాజును, చినవీరరాజు" నని ఆంధ్రకవి చరిత్రకారుఁడు మార్చెనా? ఈవిషయములోగాక మఱియొక సందర్భములో చాగంటి శేషయ్యగారట్టిమార్పు నొకదానినిగుఱించి యిట్లు వ్రాసిచ్చినారు. [9]"ఈ పద్యములోని గన్నయ యనుపదమును గంపయ యని మార్చి యాంధ్రకవుల చరిత్రమునఁ బ్రకటించియున్నారు. తక్కినగ్రంథములో ననుకూలముగా నుండుటకై శ్రీ వీరేశలింగము పంతులుగారీమార్పులను గావించి యుందురు. ఇంక ననేకతావుల గన్నయ యనుశబ్దముండుటచే దీనిని మార్చరాదు." పైనఁ జెప్పినపద్యములోఁగూడ నిట్టి మార్పే జరిగినదా? అది యట్లుండగా శుద్ధప్రతిలోని పిల్లలమఱ్ఱివీరరాజెవరో యిటుతర్వాత విచారించెదము.

అసలు గోపరాజకవి కాలనిర్ణయమునకు నితరాధారములు గలవు. ఆకవి తనవంశమును వర్ణించుకొనెను. దానినుండి కొన్నిచారిత్రకాంశములు తెలియుచున్నవి. అతని వంశవృక్ష మిట్లున్నది.

ఆవంశమునకు మూలపురుషుఁడైన వెన్నవిభుడు లేక వెన్నమామాత్యుఁ డిట్లు వర్ణింపఁబడినాడు.

[10]సీ. కలుష మండలిక భేకఫణీంద్రుఁ డన రాయ
గజగంధవారణఖ్యాతి మెఱసి
వీరఘోట్టవిభాళుఁ డారూఢబిరుదవి
రోధి కళింగవిరోధి యనఁగ

9. ఆంధ్రకవి తరంగిణి సం 5 పు 266.
10. సింహాసన ద్వా. భా. ఆ 1 ప 42.

తరములు.

| | తరము |
|---|---|
| వెన్నవిభుఁడు (క్రీ. శ. 1186–1206) (వెలనాటి పృథ్వీశ్వరుని మంత్రి) | 1 |
| తెలియదు | 2 |
| అమరేశ్వర మంత్రి = గంగాంబ | 3 |
| అన్నయ; సింగయ = గంగమ | 4 |
| పెదిరాజు (మల్లనదేవ రాజమంత్రి) [అన్నయ కుమారుఁడు]; అబ్బయ, గోవయ = ఎల్లమ, సత్తెనారన (రామాయణకృతికర్త) [సింగయ కుమారులు] | 5 |
| రామరాజు, కేసన, బాచిరాజు, సింగన (అనపోతకుమార సింగని మంత్రులు) [పెదిరాజు కుమారులు]; కసవరాజు = కామమ (రాణా మల్లనరేంద్రుని మంత్రి) [గోవయ కుమారుఁడు] | 6 |
| గోపరాజు (సింహాసనద్వాత్రింశికకర్త) | 7 |

వెలసి నానాటికి వెలనాటిపృథివీశ్వ
రుని రాజ్యభారధుర్యుం డనంగ
నారెలుగన్నడీ లజవలుఁ దెలుగులు
తనబిరు దందియఁ దగిలి కొలువ
ఆ. వె. నెగడి సనదవోలు నెలవుగా భూసుర
వంశసాగరామృతాంశుమూర్తి
చక్రవర్తి మాన్యసౌజన్యధన్యుండు
విక్రమార్కవిభుఁడు వెన్నవిభుఁడు.

వెన్నయామాత్యుఁడు వెలనాటి చోడపృథ్వీశ్వరుని మంత్రి. ఆ చోడరాజు చందవోలు రాజధానిగా వేగిదేశమును బాలించెను. [11]అతని శాసనములు క్రీ. శ. 1189-1206 వఱకుఁ గనబడుచున్నవి. అతనితండ్రియైన[12] గొంకరాజు శాసనములలోఁగూడ వెన్నయమంత్రి పేరున్నది. కాఁబట్టి గొంకరాజు కాలమునుండి కూడ వెన్నయ మంత్రిపదవిలో నున్నాడు.

అతనితర్వాత ప్రసిద్ధుఁడైనవాఁడు అన్నయామాత్యుఁడు. కాని యెందుచేతనో గోపరాజకవి యతనిని గుఱించి వివరింపలేదు. ముప్పదియిద్దఱు మంత్రులచరిత్రలో నిట్లున్నది.

సీ. ఘనదానకర్ణుఁడై గండపెండెము దాల్చె
కొఱవియన్నామాత్యకుంజరుండు

ఈ యన్నయకుమారుఁడు పెద్దిరాజు. అతఁడు పల్లికొండరాజైనమల్లనదేవరాజుయొక్క మంత్రిగా బేరు బొందినాడు.

[13]క. అన్నయనామధేయసచివాగ్రణిపుత్త్రుఁడు పెద్దిరాజు సం
పన్నిధిపల్లికొండజనపాలుఁడు మల్లనదేవరాజుచే
నెన్నఁగఁ గుంచెలందలము వెల్లియుఁగైకొని మంత్రియై ప్రతా
పోన్నతి కెక్కె ధర్మముల నొప్పెడుబ్రహ్మవనప్రతిష్ఠలన్.

11. ద. హిం. శా. సం. 5-1254; ఎ. ఇ. సం. 4 పుట 22
12. ద. హిం. శా. సం. 4-1204; 1205
13. సింహాస. ద్వా. ఆ. ౧. ప. 46

పెద్దిరాజు మంత్రిత్వముచేసినపల్లికొండ యెక్కడ నున్నది ? తెలంగాణములో పల్లికొండ యను పేరు కనబడలేదు. ఆపేరు గలగ్రామ మొకటి యుత్తరఆర్కాడుజిల్లాలో పాలేటితీరమున గుడియాత్తముపట్టణమునకు నారుమైళ్ళదూరమున నున్నది. ఇచ్చట పండుకొన్నరంగనాథస్వామి యాలయ మున్నది. ఇదిగాక మఱియొకపల్లికొండ[14] తెలుగుదేశములోనే పల్నాటిప్రాంతములో నున్న దని చెప్పవచ్చును కాటమకథలో మనుమసిద్ధికిని, కాటమరాజునకును చెలరేగినయుద్ధములో కాటమరాజుపక్షమున పల్లికొండప్రభు వైనచల్లపిన్నమనాయఁడు సాయపడినాడు. ఈస్థలమె యటుతర్వాత మరికొంతప్రసిద్ధిని పొంది యుండవచ్చును. మల్లదేవరాజుయొక్క ముందు వెనుకలు తెలియుటలేదు. ఇతడు పల్నాటిలోని ప్రభువు కావచ్చును.

చేమకూర వెంకటపతిగాక చేమకూర యప్పన్నకవి వ్రాసిన సారంగధర కథ ననుసరించి బాణాల శంబుదాసుఁడు మంజరి (ద్విపద) లో సారంగధరచరిత్రను వ్రాసినాడు. ఇతఁడు కంసాలి. పల్లికొండలోని గోపాలునివరమున కవిత్వమునుబొందినాడట. ఇట్లు పల్లికొండ యను యూరు ప్రశంస యీ గ్రంథమునం దున్నది. బాణాల కవిని గుఱించి విశేషములు తెలియవు.[15]

అటుపిమ్మట గోపరాజవంశములోఁ గీర్తిగాంచినయతఁడు సత్యనారన—

[16]కం. రామాయణకృతి కృతినై
తా మెఱయుచు సంధ్రిసుకవితామహుఁ డనఁగా
భూమిని మించిన భీమన
నామంబునఁ బరఁగె సత్యనారన ఘనుఁడై.

14. ఆంధ్రకవి తరంగిణి సం. 2 పుట 248
15. ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారపు కాటలాగ్ సం. 2 భాగము 3 (తెలుగు) పుట 52త
16. సింహాస. ప్ర. భా. అ. ౧ ప 40

సత్యనారనకని యాంధ్రకవితాపితామహుఁడు, భీమనవంటి వాఁడు. అయితే యాతనికృతి యైనరామాయణ మిప్పుడు లభించుటలేదు. ఈ కవి యేయూరిలో నుండెనో, యెవరికిఁ గృతి నిచ్చెనో ?

గోపయమెల్లమ్మలకొడుకు కసవరాజు. అతనిభార్య కామమ వారు గోపరాజకవియొక్క తలిదండ్రులు. కసవరాజుసంగతి యే మనగా—

17వ. ఇట్లు గోపరాజతనూజుం డైనకసవరాజు దానగుణరాధేయుం డగురాణామల్లనరేంద్రునకుఁ బరమగురుఁ డై శైవాచార ప్రథమసింహాసనాధీశ్వరు లైనబ్రహ్మదేవరయొడయల కూఁతు కామాంబిక యను కామినీరత్నంబుఁ బరిగ్రహించి సుగుణ గణ్యుండై నెగడె.

సీ. వేముగల్లు జన్మభూమిగా బెరిగియు
దీవులెల్ల మాటఁ దేటపఱిచి
హరిపదైకబుద్ధి హరితగోత్రాంబుధి
రా జనంగఁ గసవరాజు మించె.

శా. రాణామల్లన కీర్తిచంద్రికలు పర్వం బొంగి ... ...
... ... ... ... ... ...
... ... ... చెల్వారి దానామృత

శ్రేణిం ద్యాగసముద్రనామము వహించె న్వేముగల్లీమహిన్.
కసరరాజు సందర్భముగాఁ జర్చింపవలసినయంశము లున్నవి.(1) అతని స్వస్థలము వేముగల్లు(2) అతనిరాజు రాణా మల్లనరేంద్రుడు (3)ఆ రాజునకు గురువు బ్రహ్మదేవ యొడయలు.

17. సింహాస. ప్ర. భా. వ 51, 53, 56

18. తెలంగాణా శాసనములు- రెండవ సం. పుట 183

వేముగల్లెచ్చట నున్నదో చరిత్రకారులకు దెలియలేదు. దాని యునికి యిట్లు తేటబడుచున్నది. వేముగల్లుగ్రామము మహబూబు నగరజిల్లాలోనిది. కుమారతైలపరాజు దానిని గోకర్ణరాసిపండితు నకు క్రీ.శ. 1111లో దానము చేసినాడు. ఇట్టిది చరిత్రప్రసిద్ధి కెక్కిన స్థలము. ఇది నానాటికిని వృద్ధిచెంది త్యాగసముద్ర మను పేరునకుఁ గూడ తగి యుండినది. వేముగంటిసంస్థానమునకుఁ గసవరాజు మంత్రిగా నుండినాడు. గోపరాజు తానుకూడ నక్కడనె యుండినా నని తెలుపుకొన్నాడు.[19]

కసవరాజుయొక్క కాలమున వేముగంటిసంస్థానాధీశ్వరుఁడు రాణా మల్లనరేంద్రుఁడు. అతఁ డెవ్వఁడు? కొలనిపెద్దిరాజు మల్లయదేవరాజు వద్ద మంత్రిగా నుండె నని పైనఁ జూచినాము. రాణామల్లనరేంద్రుఁ డును, మల్లయదేవరాజును నొక్కరేనా ? వారి పేరులు భిన్నముగా నున్న వని తెలుసుకొనవచ్చును. ఒకఁడు వేముగంటిపాలకుఁడు, ఇంకొ కఁడు పల్లికొండప్రభువు. కాఁబట్టి వా రిద్దఱును వేర్వేఱు పురుషులు మాత్రమే.

రాణామల్లనరేంద్రుని గుర్తించుటకు సాధన లేమైన నున్నవా? మల్లనరేంద్రుని వంశముపేరు రాణావా రని గ్రహింపవచ్చును.

రాణావంశమువారు చరిత్రలో నున్నారు.

పొన్నతోటయాబళకవి[20] వామనపురాణమును రచించి, రాణా జగదేవభూపతికి నంకిత మిచ్చెను. అతని గ్రంథములోఁ గృతిభర్త వంశవృక్ష మి ట్లున్నది.

---

19. సింహా స. ప్ర. భా. అ. ౧. ప 57,58.

వేముగంటి యింటిపేరుగాగల వారున్నారు. వేముగంటి దత్తాత్రేయపండితుడు కవి (ఆంధ్రకవుల చరిత్ర 1899 పుట 517). వేముగంటి యింటిపేరున్న వారు ఇప్పుడు రాజమహేంద్రవరములో నున్నారు.

20. మద్రాసు ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమందు వామనచరిత్ర ప్రతి యున్నది.

( విష్ణువర్ధన గోత్రము )
- రాణా తిమ్మరాజు
  - సింగరాజు
    - తిమ్మరాజు (జగదేవుడు)
      - పెద జగదేవుడు
      - ఇమ్మడిజగదేవుడు
      - చిన్న జగదేవుడు
      - అంకుశేంద్రుడు (= వెంగమాంబ)
        - మాదయ
        - కుమార జగదేవుడు (వామనపురాణకృతిపతి)
        - అంకుశరాజు (జాంబవతీ కల్యాణము క్రీ. శ. 1540)
        - వెంకటపతి
    - మాదరాజు
    - చెన్నరాజు
    - లక్ష్మిరాజు

అంకుశరాజునుబట్టి తరమునకు నిరువదిదైదు సంవత్సరముల లెక్కను వేయగా రాణాతిమ్మరాజు క్రీ. శ. 1400 ప్రాంతమువాడగును.

ఆ రెండు రాణావంశములకును చుట్టఱికముండవచ్చును. విష్ణు వర్ధనగోత్రిమని చెప్పబడుటవల్ల వారు వేములవాడచాళుక్యుల తాలూకువారేమో!

రాణా మల్లన రేండ్రినిగురు వైనబ్రహ్మదేవరయొడయులు శైవుఁడు. అతని గురుపరంపర నెరుగము. అతని కుమార్తెమాత్రము గోపరాజకవికి తల్లి.

పైనబడినశ్రిమ యంతయు గోపరాజకవి కాలనిర్ణయమునకు ననుకూలించుట లేదు. దానికి నుపయోగపడెడి యంశములు దిగువఁ జేర్కొనఁబడును.

గోపరాజకవియొక్క కవిస్తుతిలోని పిల్లలమఱ్ఱి వీరరాజపదము కాలనిర్ణయమునకుఁ దోడ్పడునా? పిల్లలమఱ్ఱి పినవీరభద్రునికంటె కొంచెము పూర్వుఁడైన శ్రీనాథమహాకవి (క్రీ. శ. 1380-1460) యొక పిల్లలమఱ్ఱి పండితుని తన హరవిలాసప్రబంధములోఁ జేర్కొన్నాడు.

ఉ. చిన్నటనాఁడు సత్కరుణఁ బిల్లలమఱ్ఱి మహాప్రధాని పె
ద్దన్న గురూత్తముండు .....................

గోపరాజు వచించినయతఁడు వీరరాజు; శ్రీనాథుఁడు చెప్పిన యాతఁడు పెద్దన్న. వీరిపేళ్లే భిన్నముకాబట్టి మనపనికి నుపయోగపడవు.

పిల్లలమఱ్ఱివారిలో పెక్కుమందికవు లున్నారు. పినవీరన తన తాత, తండ్రి, యన్నయు గొప్పకవు లని యిట్లు నుడివినాడు.

క. తాతయు దండ్రియు నగ్ర
భ్రాతయునుం దాను భువనభాసురకృతిని
ర్మాతలు, పిల్లలమఱ్ఱి వి
ఖ్యాతునిఁ బినవీరుఁ బోలగలరే సుకవుల్.

పినవీరభద్రుని తండ్రిపేరు గాదెయ. తాత పేరు తెలియదు. పెనుమళ్ల సోమయకవి[21]కూడ పినవీరన వంశవృక్షవర్ణనను పినవీరనతోనే

21. సోమయకవి సమంతీపరిణయప్రబంధమును వ్రాసినాడు.

మొదలుపెట్టినాడు. కాఁబట్టి దానివలన ప్రయోజనము లేదు. గోపరాజకవి పేర్కొన్న వీరరాజెవఁడో గుర్తింపలేము.

గోపరాజకవి వంశములోనివా రేయేరాజులవద్ద నుద్యోగము చేసినారో పైన జూచినాము. వారినిఁ బరిశీలించి కాలనిర్ణయము చేయవచ్చును.

గోపరాజు చెప్పినమూలపురుషుఁడు వెన్నవిభుఁడు. అతఁడు వెలనాటి పృథ్వీశ్వరుని క్రీ. శ. 1186–1206 కాలపువాడు. అతనికి నేడవ తరమువాఁడు గోపరాజకవి. తరమునకు నిరువదియైదువత్సరముల లెక్కను గోపరాజకవి జననము క్రీ. శ. 1350 ప్రాంతమని నిర్వివాదముగాఁ జెప్పవచ్చును.

గోపరాజు స్తుతించిన కవులలో నాగరాజున్నాడు. అతఁడు పశుపతినాగనాథుఁ డనువిషయ మెల్ల రెరిగినదె. రాచకొండపాలకు డైన మొదటి యనపోతనాయకుని (క్రీ. శ. 1315–1385) కొలువులో నతఁ డాస్థానకవిగా నున్నాడు. నాగనాథుఁడు 1369 లో వ్రాసినశాసనమున్నది. గోపరాజకవి యతనికి సమీపమువాఁ డని తలపవచ్చును.

గోపరాజునకుఁ బెదతండ్రి వరుసలోనివా రైనబాచనసింగనలు అనపోతనాయని కుమారుఁ డైన సింగమనాయని మంత్రులు. ఆసింగమనాయ డెవఁడు ? అతఁడు మొదటి సింగమనాయఁడు (సర్వజ్ఞుఁడు) (క్రీ. శ. 1345–1412). గోపరాజుకంటె ఒకతరము పెద్దవా రైనయా యిద్దఱు మంత్రులును మొదటి సర్వజ్ఞుని కొలువులో నుండుట సబబు మాత్రమే. గోపరాజకవి జననము 1350 ప్రాంత మని గ్రహింపవచ్చును.[21A]

ఇచ్చట నొక చిన్న విచిత్రమును గమనించవలసియున్నది. సింహాసనద్వాత్రింశిక పీఠికారచయిత[22] గోపరాజకవియొక్క (వరసకు) పెద

---

21A. కాపయనాయకుడు ఓరుగంటిరాజ్యమును పాలించుచుండగా (1335) కొలువి నిశ్శంకుడను నాయకుడు డెబ్బదియిద్దఱునాయకులలో నొకడు. కాని యతనిని గుఱించి విశేషములు తెలియవు (రెడ్డిసంచిక పుట 6).

తండ్రి 1260 లో మరణించి రనియు, నటుపిమ్మట గోపరాజుమాత్రము మరియొక నూరేండ్లకు అనగా, 1350 లో మరణించె ననియు వ్రాసినారు. దానిలోని యసందర్భము బట్టబయలుగా నున్నది. ఇట్టి యసహజతీర్మానమునకు కారణ మేమనగా, గోపరాజు కవిస్తుతిలో నుచ్చరించిన 'వీరరాజ' పదమునకు పినవీరభద్రుఁ డనునర్థమును గల్పించుకొనుటయె.

చాగంటి శేషయ్యగారి సిద్ధాంతముగూడ విచిత్రగతులలో నడిచినది. గోపరాజ కవియొక్క వరుసకు పెదతండ్రు లైన బాచనసింగనలు మొదటి సర్వజ్ఞునికాలములోనివారె యని[23] మొదట తీర్మానించిరి. పిమ్మట కవిస్తుతిలోని 'వీజరాజ'పదమునకు నర్థము పినవీరభద్రుఁ డనుభ్రమ కలిగినది. దాని నిపుడు కిట్టించవలెను. అంతట వారు తరమునకు సాధారణపులెక్క యైన ఇరువదియైదు సంవత్సరములను విసర్జించి, సాధారణపులెక్క యైన నలువదిసంవత్సరములను గ్రహించి బాచనసింగనలు రెండవ సర్వజ్ఞసంగమనాయుని (క్రీ. శ. 1400–1430) కాలమువా రనువాదనకుఁ బూనుకొనిరి. అట్లు గోపరాజకవి నెనుబది సంవత్సరములతర్వాతివానిగా జేసిరి. ఈ విధముగా 'వీరరాజ'శబ్ద మొక్కటియు జీవితచరిత్రనిర్ణేతలను పెడదారులను బట్టించినది.

పిల్లలమఱ్ఱి[24A] కుటుంబము చాల ప్రాచీనమైనది. పెద్దది, ముఖ్యమైనది. క్రీ. శ. 1550 ప్రాంతమునగూడ వారు ప్రసిద్ధులు. కుంటముక్కల తిరుమలనాథకవి[24] శైవాచారసంగ్రహమను నాంధ్రపద్యకావ్యమును పిల్లలమఱ్ఱి గన్ననామాత్యున కంకిత మిచ్చెను. అందు మూడు తరములుమాత్రము వర్ణింపఁబడినవి. గన్నమంత్రికొడుకు విస్సామా

22. సింహా. పీఠిక పుటలు 6,7.
23. ఆంధ్రకవి తరంగిణి సం. 4 పుట 153.
24. ఆంధ్రకవి తరంగిణి సం 9 పుట 166-170.
24ఎ. పిల్లలమఱ్ఱి గ్రామము తెలంగాణలోని నల్లగొండజిల్లాలో నున్నది.

త్స్యుఁడు, అతనికొడుకు గన్నయ. వారు యాజ్ఞవల్క్యులు, భారద్వాజసగోత్రము, వారి ముందుతరములవిషయము తెలియదు. ఇట్లే మరి కొందరు.[25]

వీరరాజపదమునకు విపరీతార్థములను లాగి వాదములను తలక్రిందులుచేసికొనుట వ్యర్థము. అనేకమంది మహాకవుల పేర్లుకూడ మిగులలేదు. ఒక్కొక్కప్పుడు కావ్యములు మిగులలేదు. వీరరాజవిషయముకూడ నంతియె.

కవికాలనిర్ణయమున కొక్కప్పుడు ఛందస్సుకూడ కొంచెముగా సహాయపడుచుండును. రేచన నాలుగుయతు లని వేములవాడ భీమకవి పదియతు లన్నాడు. గోవరాజకవి పదమూ డని వ్రాసెను. విన్నకోట పెద్దిరాజు[26] పదియా రని చెప్పినాడు. ఇతని కావ్యాలంకారచూడామణి క్రీ. శ. 1402–1407 నాటిది. అవిధముగాఁ జూచినను గోవరాజు పదునాల్గవశతాబ్దివాఁ డగుచున్నాడు.

ఇచ్చట మరియొకవిషయమును గమనించెదము. సంస్కృతములోని పద్యకావ్యములను, వచనకావ్యములను, నాటకములను మన కవులు తెనిగించుచుండిరి. మూలఘటిక కేతనకు (క్రీ. శ. 1260 ప్రాంతము) పూర్వవిషయము మన కింతగా తెలియదు. కేతనను చూచి వెన్నెలకంటి అన్నయ షోడశకుమారచరిత్రను వ్రాసినాడో, అన్నయను జూచి కేతన దశకుమారచరిత్రను వ్రాసినాడో చెప్పుట కష్టము. 1300 ప్రాంతమున మంచనకవి కేయూరబాహుచరిత్రను సంతరించినాడు. 1350 ప్రాంతపు సంకలనగ్రంథ మైనసకలనీతి సమ్మతములో పంచతంత్రి యనుపద్యకావ్యమునుండి పద్యములు గ్రహింపఁబడినవి.

25. పిల్లమఱ్ఱి బుచ్చన్నయొక్క శిష్యుఁడు ఎలుగుపి కన్నయకవి. అతఁడు కన్నశతకమును వ్రాసినాడు. వారినిగుఱించి విశేషములు తెలియవు. (ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సం 13 సం 1 పుట 69).

26. ఆనందరంగరాట్ఛందము ఆ 3 పు 10.

అయితే తెలుగులో వచనగ్రంథములు లేవా ? వాటినుండి తెలుగు పద్యకావ్యములు పుట్టలేవా యనుప్రశ్నలనుఁ జర్చింపవచ్చును.

ఏకామ్రనాథుఁ డను పేరుగల రచయిత లిద్దఱున్నారు. ఒకఁడు క్రీ. శ. 1300 ప్రాంతపువాడు, రెండవయతఁడు 1550 ప్రాంతమున నుండిన సంస్కృతకవి. అతనిప్రశంస యిచ్చట నవసరము లేదు.

1300 ప్రాంతమున నుండిన యేకామ్రనాథుడు పాల్కురికిసోమనాథకవియొక్క శిష్యుడు. ఏకామ్రనాథుఁడు ప్రతాపచరిత్రమను తెలుగువచనకావ్యమును క్రీ. శ. 1330 ప్రాంతమున సృష్టించినాడు. అరచనను కాసె సర్వప్ప యనుకవి ద్విపదలోని కనువదింపగా, కూచిమంచి జగ్గకవి సోమదేవరాజీయ మనుపేర ప్రబంధముగా మార్చినాడు. దీనినిబట్టి యదే పేరుగల వచనకావ్యముగూడ కలదు.[26A] ఏకామ్రనాథుఁడు సింహాసనద్వాత్రింశిక[27] యనువచనగ్రంథమునకుఁగూడ కర్త. ఆగ్రంథమే కొఱవి గోపరాజకవియొక్క సింహాసనద్వాత్రింశికకు మూల మనవచ్చును.[28] అయితే యీవిషయమును గోపరాజకవి స్పృశింపలేదు. విక్రమార్కుని గుఱించి కథలు సంస్కృతములో నున్నవి. వాటికి చిలవలు పలవలు బెంచి పుస్తకములు తయారైనవి. గోపరాజకవి కొన్ని చేర్పులను, మార్పులనుతనగ్రంథములోగూడజూపినాడు, ఒకకథను పద్యముగా, ద్విపదగా, యక్షగానముగా, వచనముగా, నిత్యాదులుగా వ్రాయుట తెలుఁగుకవులకు బరిపాటి. అట్లే సింహాసనద్వాత్రింశకకుగూడ నొక [29]ద్విపదకూ రున్నది.

---

26. ఏ. చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రులచరిత్ర సం 5 పుట 458

27. ఆం. సా. ప. భాండాగారము సం 6 సంచిక 2 పుట 100.

28. 19 వ శతాబ్దివాఁడైన మహాదేవకవి పిడుపర్తి సోమనాథకవియొక్క బసవపురాణమును తిగి పద్యకావ్యముగా వ్రాసెను. కాని మూలకవి పేరు చెప్పుకొనలేదు. గద్యమువలనమాత్రము తెలియుచున్నది. (పరిశోధనపత్రిక 1955 జూన్, జూలై సంచికలు.

29. ఆం. సా. ప. భాండాగారము సం 6 సంచిక 5 పుట 246.

రాయవాచక మను తెలుగువచనకావ్యము కుమారధూర్జటిచేత ప్రబంధీకరింపబడినది కదా! జక్కన విక్రమార్కచరిత్ర, అనంతుని భోజరాజీయము కేవలము సంస్కృతగ్రంథములనుండి గాక తెలుగు వచనకావ్యములనుండి బుట్టి యుండవచ్చును. ఈరకము గ్రంథముల జూచి కాను సాహిత్యసేవకులు తయారుచేయవలసియున్నది:

కొఱవిగోపరాజు క్రీ. శ. 1350-1410 ప్రాంతపువాఁ డనవచ్చును. అప్పటికి శ్రీనాథమహాకవికి కొంచెము పూర్వుడు, కొంతవఱకు సమకాలికుడుకూడ. కావున నే శ్రీనాథమహాకవియొక్క విద్యాధికారిత్వమునుగుఱించి యిట్లాక్షేపించినా డేమో!

30క. ధరగల పురాణముల వ్యా
కరణంబుల, శాస్త్రముల, నిగమములఁ గవితం
బరిణతుడ మాళవేంద్రుని
పురోహితుడ, జన్మసంజ్ఞ బురుహూతుండన్.
గీ. అధిపుకొలువున నే బరీక్షాధికారి
నగుటఁజేసియు, నొకవిప్రుఁ డెగడివచ్చి
యట్టికీడున నిర్జనం బైనయడవిఁ
జచ్చి గతిలేక బ్రహ్మరాక్షసుఁడ నైతి.

గోపరాజు సింహాసనద్వాత్రింశికను క్రీ. శ. 1400 ప్రాంతమున రచించి యుండవచ్చును. తిక్కనమహాకవి పరిచారము చేసిన హరిహరనాథతత్త్వము నిత డొంటబట్టించుకొన్నాఁడు, తిక్కనశైలిని యలవరచుకొన్నాడు. తెలుగులోని కథలకావ్యములు క్రమముగా విజ్ఞానకోశములవంటివి యైనవి. దానికి గోపరాజు పునాది వేసినాడా? కాలగర్భమునుండి బైటపడిన గోపరాజు మిగుల అదృష్టవంతుడు. అట్టి యదృష్టమునకు నోచికొన్న యాంధ్రవాఙ్మయము భాగ్యశాలిని.



30. సింహా. ద్వా. ఖ. ఆ 6 ప 43,44.

# గద్యపద్యముల స్వరూపప్రయోజనములు.

శ్రీ బయ్యా వెంకటసూర్యనారాయణ, M. A,

మనోగతాభిప్రాయము నభివ్యక్తము సేయుటే భాషయొక్క పరమప్రయోజనము. లక్ష్యమొక్కటే యయ్యు తత్సిద్ధికై శబ్దములు ధరించిన రూపములందు, అనుసరించిన మార్గములందును గల వైవిధ్యమును బట్టి భిన్నప్రక్రియ లేర్పడుచున్నవి. గద్యపద్య విభాగమిట్టిదే.

సాహిత్యము గద్యపద్యమయ మగుట ప్రసిద్ధము. "కావ్యం గద్యం పద్యంచ"- వామనుని కావ్యాలంకారసూత్రవృత్తి చంపూ రచనలో గద్యపద్యములు రెండును చోటుచేసికొన్నవి. "గద్యపద్యమయం కావ్యం చంపూ రిత్యభిధీయతే"యని తల్లక్షణము.

ఇక నుపర్యుక్తములగు గద్యపద్యముల స్వరూపము,పరస్పర సామ్య వైషమ్యములను నిట పరిశీలింతము. ఈ రెండును డిత్థడవిత్థాదిశబ్దములవలె నర్థరహితసంజ్ఞామాత్రములు గావు. 'గద వ్యక్తాయాం వాచి' గద ధాతువునుండి గద్యశబ్ద ముత్పన్నమైనది. అభిప్రాయ వ్యక్తీకరణ మాత్రప్రయోగిభాషణమే దీనికర్థము.

**Prose: Ordinary non-metrical form of written or spoken language......plain matter of fact quality......**
**Prose (oratis) straight for ward (discourse) P. 964.**
**The conise oxford dictionary of current English.**
**IV Edition,**

'పద-గతౌ' అను పద' ధాతువునుండి పుట్టినది పద్యశబ్దము చెప్పచు బోవుచున్నచో నెట్టి భాషణముననైన నొక విధమగు గతి ఉండకేమగునన్నచో నిట గతిశబ్దము సామాన్యార్థమునగాక విశిష్టగతి యను నర్థముననే ప్రయుక్తమగుట గమనార్హము. పద్యమునందు కేవలగతిగాక క్రమబద్ధవిశిష్టగతి కానవగును. కావుననే పద్యమునందు పాదనియమ మున్నది. గద్యమునం దది లేదు.

"అపాదః పదసంతానో" గద్యమ్మని దండ్యాచార్యుల కావ్యాదర్శము నుడువుచున్నది. పాదనియమముతో బాటు పద్యమున ప్రత్యేక పాదమును విశిష్టగతిక్రమయుక్తమే. గీతిధర్మ మనివార్యగుణము.

శ్రావ్యతకు సంబంధించినంతవరకు అవశ్యానుగామియగు నీకితిధర్మము పాదనియమసంప్రాప్తమగు సంతులితగతియు పద్యమును గద్యముకంటె నుచ్ఛ్రితరంబగు పీఠమున నధివసింపజేయుచున్నవి.

" The rhythm and measure of poetry elevated to a regularity certainly and force very different from the rhythm and measure, which can pernede prose, is a part of its perfection."
Arnold

అంతియగాక భావముల వడి, సాంద్రతయు నెక్కుడుగ పద్యమున నభివ్యక్తము లగును.

Poetry: Art, work of the poet, elevated expression of elevated thought or feeling in metrical form. P. 919.
The concise oxrford Diction any of Current English.
IV Edition.

గద్యపద్యములకు బాహిరమగు భేదము ఛందోరాహిత్యము, ఛందోయుక్తత. కేవల గద్యమునకు, కేవల పద్యమునకు సంబంధించిన యితర ధర్మములును గలవు. అట్లయ్యు నీధర్మములకు ప్రకరణానుసారముగ గద్యపద్యముల నడుమ పరస్పర వినిమయమును గానవచ్చుచున్నది. తొలుత స్థూలముగ ప్రత్యేకధర్మముల బేర్కొని పిదప నవ్వాని పరస్పరవినిమయమును గూర్చి పరామర్శింతము.

గద్యము సమతలగామినియగు వాహినియైన పద్యము గిరిశృంగ నిస్సరన్నిర్ఝరిణీ సదృశము. అంచగమనమునందలి యాకర్షకత పద్యమునందున్న, గద్యమున గజగమనమునందలి గాంభీర్య మున్నది. అనుభూతివ్యంజకమగుట పద్యము హృదయప్రేరితము కాగా, తర్కబద్ధమగుట గద్యము బుద్ధిప్రధాన మగుచున్నది. రసభరిత భావాభివ్యక్తిని బట్టి యొకదానియందు సాగరమునబోలె తరలతా ద్రవీభూతత్వములు పరివ్యాప్తములైన, తర్కబద్ధతథ్యకథనము ననుసరించి వేరొక్కదానియందు ఆకసమున వలె నచంచలత, స్పష్టత గోచరించును. ఉద్దిష్టభావమును వక్తనుండి శ్రోతవరకు జేర్చుటయను లక్ష్యమొక్కటే యయ్యు

నేతత్కాలవ్యవహారమున గద్యపద్యముల రూపములు, మార్గములు కొంత భిన్నము లగుచున్నవి.

కావ్య, శాస్త్రభేదమున వాఙ్మయము ద్వివిధ మని రాజశేఖరుడు విభాగించినాడు. ఇందు కావ్యమొక భవ్యసుందరప్రాసాదము. భావనాకల్పనవినిర్మిత మగు నీ సురుచిరసౌధరాజమునకు మూలాధారము తథ్యమే. శాస్త్రసౌందర్య మాపాదమస్తకము తథ్యసంబంధియే. ప్రధానముగా కావ్యము వినోదదాయకమైన శాస్త్రము విజ్ఞానదాయక మగుచున్నది. కావుననే వాస్తవజీవితమున పద్యముకంటె గద్యమే ప్రధానమైనదిగా నెన్నబడుచున్నది.

**"When life is the criterion and not art the prose of a nation is far more important than its poetry." Evans.**

కావ్యమునకు వక్రోక్తివలె శాస్త్రమునకు ఋజూక్తిలేక స్పష్టోక్తి ప్రాణము. ఈ ప్రత్యేకధర్మములు కారణముగనే ముఖ్యముగ పద్యము కావ్యరచనోపయోగిగను, గద్యము శాస్త్రరచనోపయోగిగను పరిగణింపబడుచున్నది. ఈ సామాన్యకథనమునకు పద్యము శాస్త్రరచనానుపయుక్త మనిగాని, గద్యము కావ్యరచనానుపయుక్తమనిగాని తాత్పర్యము కాజాలదు. అటులనే పద్యబద్ధములైనవన్నియు కావ్యములనిగాని, గద్యబద్ధములైనవన్నియు శాస్త్రము లనిగాని పేర్కొనుటయు నసంభవమే. రెండును రెండింటను ఏయొక్క రూపమునందైన రచింపబడగలవు. రచింపబడుచున్నవి కూడ. కారణ మేమన కావ్యమునకు ఛందం బనశ్యానుగామి కానక్కరలేదు. ఛందోవిహీనమయ్యు రమణీయార్థప్రతిపాదకమగు నొక్కశబ్దము, రసాత్మకమగు నొక్కవాక్యము కావ్యనామాంకితములు కాగలవని ప్రాచీనాలంకారికులునిరూపించియున్నారు. ("Poetry can exist without metre") ఛందోబద్ధము లయ్యును గణిత, జ్యోతిష, వైద్యాదులు శాస్త్రములే యనబడునుగాని కావ్యశబ్దకావ్యములు కాజాలవుకదా! అట్లే కథ,నవల మున్నగు

నవి గద్యబద్ధములయ్యు కావ్యములే యగుచున్నవి. వాస్తవమున కావ్యత్వ శాస్త్రత్వవిభేదము బాహిరమగు పదయోజనావిధానముపై గాక అంతరమగు ప్రతిపాద్యవిషయస్వరూపాదికముపై నాధారపడి యుండును. సంస్కృతసాహిత్యమున ఛందోబద్ధములగు శాస్త్రరచనలసంఖ్యాకములు, అట్లే అధునిక భాషాసాహిత్యములలో గద్యమయ కావ్యరచనలు లెక్కకు చిక్కక వెలువడుచున్నవి.

ప్రాచీనకాలమున శాస్త్రరచనముకూడ అవశ్యకతానుసారముగ పద్యరూపమే గ్రహింపబడగా నేడౌచిత్యానుసారముగ ననేక కావ్యరూపములగూడ గద్యరూపమే ఉపాదేయమగుచున్నది. విశేషమేమన పద్యము కావ్యరచనోపయోగియైనట్లు శాస్త్రరచనానుకూలము కాదు. కాని గద్యము శాస్త్రరచనోపయోగియైనట్లు కావ్యరచనమునగూడ సంపూర్ణశక్తిసంపన్నమై సమాదృతమగుచున్నది. గద్య మిరుప్రక్కల పదునుగల్గిన ఖండము.

ఒకప్పుడు శాస్త్రరచనలు సైతము పద్యముననే వెలయుటకు తగినకారణములు లేకపోలేదు. కాగితము, ముద్రణము, గ్రంథసంగ్రహణపరిరక్షణబాధ్యతావహ గ్రంథాలయములును నాడించుమించుగ గగనకుసుమములే. వినోదార్థికి కావ్యముగాని, విజ్ఞానార్థికి శాస్త్రముగాని చక్షురక్షరసంయోగమూలముగాక శ్రవణద్వారముననే సంగ్రహించి, జిహ్వాగ్రమున పరిరక్షించుకొనవలసియున్న రోజులవి. గద్యకావ్యము లధికముగ వెలువడకపోవుటకును, శాస్త్రములు సైతము పద్యరూపముననే రచింపబడుటకును ఇవియే ప్రధానకారణములు. స్మృతిపటమునవిస్తృతపరిమాణమున పద్యమునుబోలె గద్యమును పరిరక్షించుకొనుట సుకరముకాదు. గురుతరభారచాలనమున శకటమునకు చక్రము లెట్లు సహకారులో కాలాంతరము దనుక జిహ్వాగ్రమున విస్తృత రచనాధారమునకు ఛందము లట్లుపయుక్తములు.జ్ఞప్తియందుంచుకొనవలసిన విషయము పరిమితిలోననయైనంత సంక్షిప్తమగుట

సర్వథా అపేక్షితమేకదా! కావుననే 'అర్థమాత్రాలాఘవం పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః' అను సూక్తి బయలుదేరినది. ఇట్టి హేతువులచేతనే నాడు శాస్త్రములుకూడ పద్యరూపమువనే లిఖింపబడినవి. ఆవశ్యకతాపేక్షితమగు స్థితివిశేష మిది. ఇట నౌచిత్యానౌచిత్యవిచారమునకు తావులేదు.

కావ్యరచనోపయుక్తములగు గద్యపద్యములు, శాస్త్రరచనోపయుక్తగద్యపద్యములకంటె భిన్నములు. పద్యబద్ధములగు శాస్త్రములతో బాహిరరూపము ఛందోదయమయ్యు దాని ఆత్మ గద్యసంబంధియే. అనగా నిట గద్యాత్మ పరకాయప్రవేశము చేసినదన్నమాట. శాస్త్రరచనోపయుక్తమగు కేవల గద్య అభిధాప్రధానము. వాచ్యార్థమే. అందపేక్షితము. లక్ష్యార్థవ్యంగ్యార్థములకు పద్యమే విహారక్షేత్రము. అపద్యమే శాస్త్రరచనోపయుక్తమైన వాచ్యార్థప్రధానమే యగును. అటులనే గద్యమును కావ్యరచనోపయుక్తమైనయెడల లక్ష్యార్థ వ్యంగ్యార్థ విలసితమగును.పర్యవసాన మేమన పద్యము శాస్త్రరచనలో సహకరింపనేగినపుడు ఆత్మధర్మముల గొన్నింటిని వీడి ఆవశ్యకవివరణము, స్పష్టత, సంపూర్ణత, అన్వయసుగమతి మున్నగు గద్యధర్మముల నలవరచుకొనుచున్నది. అటులనే గద్యము కావ్యరచనలో కాలిడినంతనే సంక్షిప్తత, అన్వయకాఠిన్యము, భావగోపనము, ధ్వనిప్రధానత మున్నగు పద్యలక్షణములతో తనరూపమును సవరించుకొనుచున్నది.

కావ్యరచనాంతర్గతగద్యము పద్యతుల్యమైనను నిట్టిగద్యమున ఛందమునకు తిరోధానము గల్గుచునేయున్నది. ఈ లోపమును పూరించుటకే కావ్యగద్యము సమానపూర్ణముగ, ఓజోగుణప్రధానముగ చెప్పబడినది. "ఓజ స్సమాసభూయస్త్వ మేత ద్గద్యస్య జీవితమ్"అని యాలంకారికోక్తి. ఈధర్మములు శాస్త్రగద్యమునకు సహకరింపవు సరికదా విరుద్ధములుకూడ నగుచు.

ఛందముకాక శైలీసంబంధులగు నితరవిషయము లింకనుగలవు. పద్యశైలి యొకచో క్లిష్టమై, జటిలమైన నిక నొక్కచో సుకుమారమై సరళ మగుచున్నది. క్లిష్టాక్షరసమావేశము, సమాసబాహుళ్యము మొదలగు శైలీధర్మములు ప్రతిపాద్యరసస్థితి ననుసరించి యుండును. కావుననే కావ్యమునందు వైదర్భీ గౌడీ పాంచాలీరీతులును, కైశికి, ఆరభటి, సాత్వతి, భారతియను వృత్తులును నుపలభ్యమానము లగుచున్నవి. కావ్యమున జేరి గద్య మీ విశేషరూపముల బొందుచున్నది. శాస్త్రమున జేరి పద్యము వీనిని గోల్పోవుచున్నది. అనగా నిట్టి వైవిధ్యమున కెడమగుచున్నదని భావము. ఒక విధముగ పద్యము శాస్త్రమున బ్రవేశించి శోభావిహీన మగుచున్నది. గద్యముమాత్రము కావ్యనిబద్ధమై మరింత రాణించుచున్న దేగాని, శాస్త్రాంతర్గతమయ్యు శోభావిహీన మగుట లేదు. శాస్త్రగద్యకు సారళ్యమే సౌందర్యము. కావ్యరచనాంతర్గత పద్యమును నగరవిలాసిని యన్న, శాస్త్రరచనానిబద్ధ గద్యమును మునికన్యగా నెన్నవచ్చును.

సౌందర్యపరీక్షకు శకుంతలాదమయంతుల నిలుపరించి, కాళిదాసునకు శ్రీహర్షుని వైరమును గల్పించుట తగదుగదా!



## సంశయనివృత్తికై

శ్రీ తురగా కృష్ణమూర్తి.

పృథ్వీపుత్రుఁడైన నరకాసురుఁడు ప్రాగ్జ్యోతిషాధిపతి "యని భారత, భాగవత, హరివంశాదిగ్రంథము లుద్ఘాటించుచుండ, నాచన సోమన తన ఉత్తరహరివంశమున నరకాసురుఁడు స్వర్గముమీఁద దండయాత్ర వెడలుటను వర్ణించుచు "...... యమరావతీపురంబు నం దడవితడవి చక్కనికన్యారాజనంబులం బట్టించి తెప్పించి యందంద నందనపాదపంబులు పెఱికించి తెప్పించి యెనిమిదివేల యేనుగులం గైకొని మాహిష్మతీపురంబునకు వచ్చి..." యనియు, శ్రీకృష్ణుఁడు సత్యభామతో నరకాసురుని వధింపఁ బోవుటను వర్ణించుచు,

గీ. హరియు మాహిష్మతీపురి కరుగుదెంచి
రక్షగాఁ జుట్టి తిరిగెడు రాక్షసులకుఁ
దొలుత జముబానసము నింటిత్రోవ చూపి
పాంచజన్యంబు చే నంది బలము మెఱసి.

యనియు నుట్టంకించి యున్నాఁడు. ఈ యుట్టంకింపువలన నరకుఁడు మాహిష్మతీపురవల్లభుఁ డని తేలుచున్నది! ఇం దేది సత్యమో, యే దసత్యమో నిర్ణయించి నాసందియమునుఁ బాపుదురుగాఁక యని వేఁడుకొనుచున్నాను.

పిట్టలవేమవరం, 4—2—1968.

ఇట్లు,
తురగా కృష్ణమూర్తి.



# శ్రీ రా మ పా దు కా స్త వ ము

శ్రీ మరింగంటి అప్పలదేశికులు

శ్లో. అస్మ ద్గురుభ్యోఽ స్తు నమో యత్ప్రసాదప్రభావతః
రామః ప్రసన్నో నస్సాక్షా ద్యాశ్చేతా దధికప్రదః. ౧

శ్లో. ఆవిర్భూతౌ దశరథసుతౌ శ్రీనృసింహాగ్రహారే
హారేజే తత్సరసనవిధౌ హాగ్లతా చ సీతా
ఆదౌ పాదౌ స్వయ మకురతా మత్ర చిత్రాంబురాశీ
ర స్తజ్జన్మా నఖలహృదయ ద్రావణౌ రావణారేః(రీ). ౨

శ్లో. చిత్రం యత్రి శిలాతలేనుఘటితం రామేణ పాదద్వయం
సాక్షాల్లక్ష్మణవారుణాస్త్ర విభవా జ్జాతంచ శీతంపయః
సీతాయాః కరుణాకటాక్షవిభవా త్సంపాదితాః సమ్పదో
మిత్రైరత్రి వృతో నృసింహనగరే జీవేయ మాయుశ్శతమ్. ౩

శ్లో మాభూయా త్కల్పవాటీ స్ఫటికమణికుటీరత్నపేటీవధూటీ
శాటీపీటీ పటీరై ర్ఘటిత మపి సుఖం సో స్తరాటీ కతాన్నః
ధాటీరక్షః కరోటీ ఘటన విఘటనద్వారఝాటీకవాటీ
కోటీలంకా నిశాటీ కటుతరపటుతాపాటక స్తాటకారిః. ౪

శ్లో. సీతాలక్ష్మణపూర్ణపార్శ్వ యుగళం స్మేరాననామ్భోరుహం
మేఘశ్యామ ముదారబాహుపరిఘం విస్తీర్ణవక్షస్థలమ్
కర్ణాన్తాయతలోచనం కటిలటీసంవీతపీతాంబరం
ధ్యాయేఽస్మత్కులభాగధేయచరణం రామం జగత్స్వామినమ్. ౫

శ్లో. శిలాతల కృతాస్పదం పద మవేక్ష్య సాసూయయా
యయా కుటిలవీక్షితక్షితిజరోచిషా చక్షుషా
తయా మధుర సాన్త్వనై ర్మనసి శీతయా సీతయా
నృసింహపుర రాఘవో నిభృత మాదృతః పాతు నః. ౬

శ్లో. ఆత్మాశ్రితానా మమృతస్య పాదౌ యోగీన్ద్రసన్మానసజాలపాదౌ
సన్తాపనిర్వాపణచన్ద్రపాదౌ పత్యూ రఘూణాం ప్రణమామి పాదౌ.

శ్లో. సాక్షా దక్ష్ణోః స్వయ మకురుతా మత్రి రామస్య పాదౌ
సార్ధం సార్ధోఽప్యజని జనుషా దేశిక స్త్వోపదేశః
పూర్వం సర్వం ద్దురితమపి మే భూరి దూరే పరాస్తమ్
జీవః కోవా భువి కపయితుం మత్సమృద్ధిం సమగ్రః. ౮

శ్లో. సత్యం జగత్సదితరా మిదమేవ జీవన్
భద్రాణి పశ్యతి వచః ప్రతిభాతి యస్మాత్
అస్మాభి రాఘవ పయోధితలం ప్రవృత్తై
ర్దృష్టా ఙ్ఘ్రిరత్నసులభః కలభో రఘూణామ్. ౯

శ్లో. నమో రామాయాస్తు ప్రతిదిశసమేతాసురచమూ
సమూహా ప్రాణౌఘప్రశమననిరాయాసధనుషే.
సమీరవ్యాలోలత్కువలయదళశ్యామవపుషే.
క్షమా పుత్ర్యా స్స్నేహా దధరదళమాధుర్యవిదుషే. ౧౦

శ్లో. నమ స్తుభ్యం మాత ర్నిమి కులసముద్రోత్థితసుధే
ప్రధీయా న్నాథ స్తే భ్రుకుటిభటకోటీసుఘటితః
యత స్త ద్ద్రాక్షావల్లీకృతసదుపదేశేన పురతః
స్థితే నష్టే. (స్పష్టే.)ఽప్య గమ దపహర్తుం మణిమృగమ్. ౧౧

శ్లో. నమ స్తే సౌమిత్రే! నను వినయశీలేన భవతా
హ్యయోధ్యారధ్యాయా మపి విపినదేశేఽనుసరతా
సరామో రామ స్తే సతతఘటితః పక్ష్మపుటయో
రలం త్రాత స్త్రాత త్వయి జయతి సౌభ్రాతృగరిమా. ౧౨

శ్లో. కనకమృగనిగాళచ్ఛేదనాత్ఖిన్న రత్నా
ఙ్కుర పరిణతధూళీ ధారణా శోణబాణః
అదిశ దిహ శరణ్య స్సానుజ స్సానుజాయా
స్స్వచరణమణి యుగ్మం సార్వభౌమో రఘూణామ్. ౧౩

శ్లో. ప్రాయేణ ప్రణయేషు యత్ప్రణయినీపాణిక్వణత్కఙ్కణ
శ్రేణీ శోణమణిప్రణీత కిరణోద్గారేణ నీరాజితం
క్షోణీ నశ్చరణౌఘమానిగృహిణీ పాషాణతాశోషణా
త్రాణం త్వచ్చరణద్వయం రఘుమణే క్షీణా న్వృణాం మన్మనః. ౧౪

శ్లో. యోవై రావణవైరిణ శ్చరణజో రేణు ర్మునే ర్దారుణాం
దారాణా మచలారిణా ప్రణిహితా జ్ఞాణిక్యమాణిక్యతాం
స్త్రీణాం దూషణకారణం ప్రవియనత్ క్షీణేచకార క్షణాత్
క్షోణీయా ద్రవణతస్య మే మణిశిరస్త్రాణాయమానో భవేత్. ౧౫

శ్లో. అస్తు స్వస్తి సమస్తమ స్తకతలాభ్య స్తం ప్రశ స్తం పురా
సీతాయా స్తరుణ స్తన స్తపకయో రభ్య స్త కస్తూరికం
ప్రస్తావ్య స్తవ సం స్త వా స్తికమనోవ స్తవ్యమ స్తవ్యయం
న్య స్తం వా స్తవ నిస్తులం రఘుపతే త్వత్పాదవ స్తు స్తుమః. ౧౬

శ్లో. రామాయ క్షితికన్యకా విహరణా రామాయ నీలోత్పల
శ్యామాయ స్మరనిత్యబాధితరిపుశ్యామాయ తుభ్యం నమః
కీర్తి శ్యామనిచోళసంవలిత దిగ్గ్రామాయ దీవ్యద్గుణ
గ్రామాయ స్వపదప్రవిష్ట నృహరి గ్రామాయ భూయో నమః. ౧౭

శ్లో. ఇదం దశరథార్జితం భరతలక్ష్మణాభ్యర్చితం
తపోధనమనోధనం సకలసంపదాం సాధనం
నృసింహనగరాని కే జయతి రామపాదద్వయం
శిలాముకురబిమ్బితం రహసి సీతయా చుంబితం. ౧౮

శ్లో. పాణే రాభరణం వరం రఘుమణే గీర్వాణనిర్వాణహృ
ద్వైరిప్రాణసమీరపారణమదవ్యాఘూర్ణమానం ధనుః
పార్శ్వ ద్వైతవిభూషణప్రణయినీ సీతా సుమిత్రాసుతౌ
భూషా తే పదపద్మయోశ్చ భవతా మేషా మనీషా మమ. ౧౯

శ్లో. నవయే హృదయే నిషణ్ణమాదృ గ్విశతేసాయమనాదిరశ్మిమాదృక్
జగతా మియతా మనుష్రితా దృ గ్దయతా ద్రాఘవశేఖరస్య
తాదృక్. ౨౦

శ్లో. విబుధబహువిధోపయోగయోగ్యమ్స్వాశరనిమజ్జనసజ్జనానురాఘం
దశరథజననాథ భాగ్యలబ్ధం మరకతరత్నతటాక మాశ్రయామః. ౨౧

శ్లో. సీతాయాః కరపాకుమార్యవిభవాభిజ్ఞం పరజ్ఞానినాం
చేతః పద్మమధూళి ధూళినివహాస్నాతాను లిప్తాకృతి
విన్యస్తం భరతాగ్రజస్య చరణద్వైత (౦) సుజాతం మయా
దిష్ట్యాదృష్ట మదృష్టదృష్టఫలయా స్నాధారణం సాధనమ్. ౨౨

శ్లో. సీతానేత్ర సుధాఞ్జనం మునిమనస్సఞ్చారభఙ్గావహం
త్రస్యద్దేవవిరావరావణయశః కాదమ్బకాదమ్బినీ
లోకానా మసమాపతః పరిణతి స్సాకేతసంవాసినా
మస్మాకం కులదేవతా విజయతే సౌమిత్రిమిత్రం మహః. ౨౩

శ్లో. ఛిన్వానం గుణమాశ్రితాఘదురితం ధున్వాన మన్తః కృపాం
తన్వానం శుభముత్తరోత్తరగుణం మన్వాన మానన్దినం
తన్వానం, తరుచా విధూతసుమనో ధన్వాన ముద్యద్గుణో
దన్వానం రఘుసార్వభౌమ మనఘం నన్వానమామ్యన్వహమ్. ౨౪

శ్లో. మాతస్సీతా! జనని భవతీ మాదృశా మీదృశానాం
రక్షాదీక్షా వహనమహతీ దేవతా దేవతారః
యస్మా దస్మత్స్వ పనసమయే స్వాభి రాలీభి రేత్య
స్పష్టం దృష్టం త్వ మిహ కరుణా లోలపక్ష్మైః కటాక్షైః. ౨౫

శ్లో. పర్యస్తా ఇవ దండకావనదిశాం పీథీషు రామత్విషా
వ్యాహృష్ట చరన్మయూరతరుణీశ్రీవారుచో వీచయః
దృశ్యాస్తై రపిచ ప్రసన్నమధురై రశ్రాన్త మామానినాం
నిర్ధూతా ఇవ నిర్భరామృతరస స్రోతస్వినీ నిర్ఝరైః. ౨౬

శ్లో. లోకానీకవశీకృతా విఫలితే పాశ్చాత్యశస్త్రోత్కరే
సౌన్దర్యం భవతా విశృఙ్ఖల మిదం బ్రహ్మాస్త్ర మావిష్కృతం
పౌరా జానపదా భృశం వనచరా దేవా నరా వానరా
వృక్షాః పక్షిగణ శ్చ యత్ర వివశప్రాణా రఘూణాంపతే. ౧౭

శ్లో. మరన్ద కదలీ సుధామధురసాలమృద్వీచయో (యా)
మనోహరణ ధోరణీ పదకదమ్బ సంపూరితా
దదాతు శుభ మప్పలార్య కరుణారసోద్దీపితా
నృణా మఘవిదారిణీ రుచిర రామపాద స్తుతిః. ౧౮



# శాపవిముక్తి

విద్వాన్ శ్రీ గున్నేపల్లి అక్షయలింగకవి

ఆ. వె. సర్వ వేదవిదుఁడు సమధికజ్ఞానసం
సన్నుఁ డాహితాగ్ని పరమశాంతుఁ;
డురుదయార్ద్రహృదయుఁ డుద్దాలకుం డను
మౌని కలఁడు మున్ను మహితయశుఁడు. 1

ఉ. ఆ ఋషిశేఖరుండు కలహప్రియయుం బ్రతికూలయున్ దురా
చారయు నైన చండికను జాయఁగఁ జేకొని యింమకేని సం
సారసుఖానుభూతిఁ గనఁజాలక వేసరి యాయవజ్ఞ నే
తీరున సంస్కరించి గడిదేఱఁగలాడ నటంచుఁ జింతిలున్. 2

సీ. జపమాలఁ దెమ్మన్న సగగ సూత్రముఁ దెంచి
నలుగెలంకులను బూసలను జిమ్ము
సంధ్య; నుపాసింప జలపాత్రి నిమ్మన్నఁ
బంతమ్ముతో దానిఁ బగులఁగొట్టు
తడిదోవతిం దెచ్చి యిడు మన్న నడిమికిఁ
జిడిముడిపాటుతోఁ జించివైచు,
సమిధలం గొని వేగఁ జనుదె మ్మటన్నచో
నగ్నిగుండము నెల్ల నార్పఁ గడఁగు
చెలువ కింటిటికోపమ్ము వలవ దనిన
ముసలమును బూని ప్రహరింపఁబోవు నవుర!
కనలు టెఱుఁగని యుద్దాలకునకుఁ దక్క
చండి గావించుదుష్కృతుల్ సైప నగునె ? 3

కం. పుట్టువునఁ బుట్టుగుణముల
నెట్టిమహాత్ములకునైన నెడవఁగ వశమే ?
నెట్టికొని పాలు తేనియ
లెట్టువలం బెంప వేము తియ్యఁగ నగునే ? 4

కం. ఈలీల నెఱపు తనయి
ల్లాలియకృత్యముల నెల్ల నరయుచు; నయ్యు
ద్దాలకుఁడు దాల్మి నెట్టెటొ
కాలమ్మును గడపఁ గొంతకాలమ్మునకున్. 5

గీ. తీర్థసంసేవ నఖిలదిగ్దేశములను
గ్రుమ్మరుచు శిష్యు లెల్లగుఁ గూర్మిఁ గొలువ
గురుఁడు కౌండన్యుఁ డనుమునికుంజరుండు
తన్నుఁ దిలకింప రా బ్రమోదమ్ము నంది. 6

గీ. గురుని బూజించి డెందమ్ము గుదురుపడఁగ
భార్య విపరీతవృత్తమ్ము వ్యక్తపఱిచి
దీనికిం బ్రతిక్రియఁ బ్రసాదింపుఁ డనుచు
నంజలి ఘటింపఁ గౌండిన్యుఁ డనియె నిట్లు. 7

గీ. అగ్నిసాక్షిగఁ బరిణయ మాడినట్టి
పడఁతి విడనాడఁ దగ దెట్టివానికైన
యుక్తిసాధనమున సౌఖ్య మొందవచ్చుఁ
జింతిలఁగ నేల ? నీదువాంఛితము దీరు. 8

గీ. నెఱపఁవలసిన కార్యమ్ము నెఱప కనియు
నెఱపఁగారాని కార్యమ్ము నెఱపు మనియుఁ
దాఱుమాఱుగఁ దెలుప నీతలఁపు లెల్లఁ
దప్పక ఫలించు నిదియ యుత్తమపథమ్ము. 9

కం. అని తెలుపఁగ గురువరుహిత
మును విని లోనికిఁ జని కడుముదమున భార్యం
గని తలవాకిటి కెవ్వరొ
చను దెంచిరి సత్కరింపఁ జను నే? వారిన్. 10

గీ. భోజనాదికసౌకర్యములకు మరగి
'దేశద్రిమ్మరు' లిటకు నేతెంచిరేమొ?
సంశయింపక బయటికి సాగనంపు;
మనినఁ జండిక తిలకించి సాదరమున. 11

కం. లోనికి రం డని వారికి
స్నానానుష్ఠానములకు సమకూర్చి యమం
దానందకలిత యై స
న్మానించె విభుండు ముదిని మఱిమఱి మురియున్. 12

కం. నిండుకొనుభక్తిఁ జండిక
వండిన బహుభక్ష్యభోజ్యపరమాన్నములన్
మెండుగ భుజించి చనియెం
గౌండిన్యమహర్షి శిష్యగణసంయుతుఁ డై. 13

కం. నెప మెన్నక సర్వవిధుల
విపరీతవచోనియుక్తి వెలయింపఁగ స
త్తపసియు నిజసతి యొనరుచు
నుపకృతులకుఁ దనియునంత నొకదివసమునన్. 14

గీ. భార్య చండికతో మౌని పలికె నిట్లు
రేపటిదినమ్మునను మనగృహమునందుఁ
బైతృకము నిర్వహింపఁగవలయు; నయిన
నిట్టినిష్ఫలకార్యమ్ము; నే నొనర్ప. 15

కం. ఎక్కడిపితృలోకము మఱి
యెక్కడిబ్రాహ్మణులు వీరి మృష్టాన్నములన్
జొక్కించిన నటఁ బితరులు
చొక్కుదు రట! యింతకన్నఁ జోద్యము కలదే! 16

గీ. వ్యర్థ మగు కర్జ; మిది దీని నాదరింప
నాదరించినబధిరులఁ, నీచమతులఁ
గూళలను, దుండగులఁ, గుండగోళకులను
పాపసంగతుల నియమింతు బ్రాహ్మణులుగ. 17

ఆ. వె. ఆళ్లు, చోళ్లు, జొన్న; లలసందె; లులవలు
కందు; లనుము; లాదిగాఁ గలట్టి
ధాన్యములను గూర్చుఁ దశయక నట్టింటఁ
జెట్టుముకయుఁ బెత్తెఁ జేర్చు మఱియు. 18

కం. ముల్లంగి, చిజ్జి, మేడియు.
నుల్లియు, నలనేతిబీఱయుం జెంచలియున్
నెల్లియు మున్నగుకూరలఁ
బెల్లుగ సమకూర్చు మదికిఁ బ్రీతి జనింపన్. 19

ఆ. వె. కుతపకాలమునను గొంకక నిద్రించి
శ్రాద్ధకర్మ; మవల సంఘటింతు
బ్రాహ్మణులకు నూత్నవస్త్రమ్ము లీయక
దోఁచికొందు వారి దోవతులను. 20

కం. అని తెల్పఁగ విని చండిక
కనుఁగవ నిప్పుకలు రాలఁ గాంతుని మొగముం
గని దీని నేన నెఱపుదు
నని యోగ్యుల నాఁటిరేయి నాహ్వానించెన్. 21

గీ. వేదవేదాంగవిదు లైనవిప్రవరుల
బ్రాహ్మణార్థమ్ము నియమించి భవన మెల్ల
గోమయమ్మున నలికి ముగ్గులు ఘటించి
స్నాతయై సర్వసామగ్రి సంతరించి. 22

సీ. యవమాషముద్గశాల్యాదిధాన్యములతోఁ
స్తవనీయ మైనభక్ష్యములతోడ
శాస్త్రానుగుణ మైన సకలశాకములతోఁ
జవులూరునట్టి పచ్చడులతోడ
అతులితంబైన గోఘృతపాయసములతోఁ
గమ్మని పెరుగుమీఁగడలతోడ
కమియఁ బండినయట్టికదళీఫలాళితోఁ
దక్షిణాన్వితసువస్త్రములతోడ
యుక్తకాలమ్మునందు వేదోక్తవిధిని
నాబ్దికము నిర్వర్తిలఁజేయ, నాతిఁ డలరి
యాప్తులం దాను భుజియించునవసరమున
భానుబింబమ్ము గన్పట్టెఁ బశ్చిమమున. 28

చం. అలఘుతరప్రమోదమున నయ్యెడ నమ్ముని వ్యగ్ర్యయమ్ముగాఁ
బలుకువిధానమున్ మఱచి పార్వణముం గొనిపోయి గంగలో
గలుపు మటన్న నచ్చెలువ గ్రక్కునఁ జెంగటిపెంటకుప్పపైఁ
దలఁకక పాఱవైచిన నతం డది చూచి మహోగ్రమూర్తియై. 24

ఆ. ఓసి నిర్భాగ్యురాల! యెట్లోర్తు నిన్ను
నీదురాచారజలధి నే నీదఁజాల
పరమపావన మైనపార్వణము పెంట
పాలు చేసితి; వెంతటిపాపి; వంచు. 25

కం. రోషోద్ధతి నిజసతి నిటు
భీషణవాక్కుల శపించె వింధ్యాటవి నీ
దోషములకుఁ బ్రతిఫలముగఁ
బాషాణత్వము వహింపు బహువత్సరముల్. 26

మ. అని యీరీతి శపింపఁ జండికయుఁ శోకాక్రాంతయై నాథుఁ గ
న్గాని ప్రార్థింపఁగ మౌని యిట్టులనియెం గొన్నాళ్లకున్ ధర్మనం
దను యజ్ఞాశ్వము నిన్నుఁ దాకిన నితం దప్పింప నేతెంచు న
ర్జునహస్తాబ్జము నీశిలాకృతిని నిర్మూలించుఁ బో పొమ్మిఁకన్. 27

గీ. జాలిపెంపునఁ జేసి యుద్దాలకుండు
సతికి నిమ్మయి శాపమోక్షమును దెలిపి
మునులు విస్మయపడఁ దపోవనికి నరిగి
సచ్చిదానందపద మొంద సన్న్యసించె. 28

గీ. అంతఁ గొన్నినాళ్లకుఁ బాండవాగ్రజుండు
జ్ఞాతివధచేత జనియించు పాతకమ్ము
వాయఁగా నశ్వమేధమ్ము సేయఁబూని
సైంధవము వెంటఁ జన ధనంజయునిఁ బంపె. 29

గీ. సైంధవమ్మును దేశదేశములు గడచి
పల్లెలను బట్టణమ్ములు పర్యటించి
వింధ్యవనిఁ జొచ్చి యచ్చట వెఱపుగొలుపు
గండశిలతోడ నొరసి తాఁ గదలకుండె. 30

గీ. బిగురుగండెను జిక్కినఖగముపోల్కి
ప్రస్తరమునంటి యుండునశ్వమును జూచి
వెఱగుపడి ఫల్గునుఁడు దాని వెలువరించు
తెరవుఁ గానక తత్పరిసరమునందు. 31

సీ. గున్నయేనుఁగులతోఁ గూర్మి పెంపెసలారఁ
జెరలాటములు సల్పు సింహములును
హరిణశాబకముల నక్కునఁ జేర్చి ని
ద్దురవుచ్చునట్టి శార్దూలములును

అహిపోతములకు నృత్యములచే నానంద
మొదవించునట్టి మయూరములును
ముదము నివ్వటిలంగ మూషికార్భకముల
లాలించునట్టి మార్జాలములును
జాతివైర ముడిగి సర్వజంతువితతి
వెలయఁ దరులతావిహగసంకలిత మగుచు
నేత్రపర్వమై శాంతికి నిలయమైన
సౌబరిమహామునీంద్రునాశ్రమముఁ గనియె. 32

మ. కని యచ్చోటఁ గిరీటి ధర్మజుఁ డాతన్ గారుణ్యపాథోధి స
జ్జనసంస్తుత్యచరిత్రు, నిశ్చలతపస్సంపన్ను, సంవిత్ఖనీం
ద్రుని, సమ్యగ్గుణసాంద్రు సౌబరిమునీంద్రుం జూచి కేల్మోడ్చి యి
ట్లనియెన్ ధన్యుఁడ నైతి నియ్యెడ మహాత్మా! మిమ్ము దర్శించుటన్.

చ. అనఘ! మదగ్రజుండు నను నధ్వగఘోటకరక్షణార్థమై
పనుపఁగ నద్ది యెల్లెడలఁ బర్యటన మ్మొనరించి యివ్వనిం
బెనుశిల నంటి వెల్వడమి వింత ఘటిల్లెను దీనికిన్ విమో
చన మెఱిఁగించి ధర్మసుతుజన్నము గావఁగ మిమ్ము వేఁడెదన్. 34

చం. వినయమువదోనిహాఖి నిటు వేఁడఁగ సమ్ముని దివ్యదృష్టితోఁ
గని మును దండి చేసినవికారపుఁజేతలు భర్తృశాపమున్
బనుపడఁ దద్విముక్తియును బొందని కేర్పడఁ జెప్పి నీకర
మ్మున స్పృశియింప వానికి విమోచన మయ్యెడు నట్లు సేయుమా!

కం. ఇమ్మెయిఁ దెలిపిన సజ్జనుఁ,
డమ్మునివరునకుఁ గృతజ్ఞతాంజలు లిడి మో
దమ్మునఁ జని నిజహస్తా
బ్జమ్మునను స్పృశించి వానిబంధము వాపెన్. 36

# గ్రంథస్వీకారము-సమీక్ష

శ్రీ బండారు తమ్మయ్య

1. శ్రీ మడివాలు మాచయార్య చరిత్ర:- కర్త- శ్రీ దుర్గం బత్తెనయ్యగారు, గుండ్లపాలెం, నెల్లూరు జిల్లా. క్రౌను పుటలు 40. వెల రు. 0-75.

2. గద్య లేఖావళి (మొదటి భాగము) క్రౌను పుటలు 24, వెల 0-50 పై.

3. శ్రీమతి అన్నపూర్ణాదేవిస్మృతి డిటో డిటో

4. శ్రీ జాస్తి వెంకటనరసయ్యస్మృతి డిటో డిటో

ప్రకటనకర్త:- విద్వాన్ కోగంటి దుర్గామల్లికార్జున కవిగారు, కార్యదర్శి- భారతీ సమితి, పామఱ్ఱు, కృష్ణాజిల్లా.

5. శ్రీ బసవ మానస చరితామృతము :- సంపాదకులు - ప్రకాశకులు:- శ్రీ బి. జాగప్పగారు, M. A., I. A. S. రిటైర్డు కలెక్టరు, శ్రీశైల వీరశైవ సంఘాధ్యక్షులు, అనంతపురము. డెమ్మీ పుటలు 122. వెల రు. 2-00.

(1) మడివాలు మాచయ్య మహాశివభక్తుఁడు, జన్మతః రజకకులజుఁడు. వీరశైవ మతోద్ధారకుఁడు, భక్తి భాండారి యని ప్రసిద్ధికెక్కిన కల్యాణబసవేశ్వరుని కాలమం దాతనికి సహాయుఁడు ననుచరుఁడుగనుండి యాతని స్వర్ణభక్తిభండారమునకు నిరపోపలముగ వఱలిన నిష్ఠుర వాది యను సన్నుతికెక్కిన వాఁడు. ఈతఁడు వీరభద్రుని యవతారమని, దక్షయాగధ్వంస సమయమున ముప్పదిమూఁడుకోట్ల దేవతల మోఁదిమోఁదియుఁ దన చేతుల తీట తీఱలేదని వీరభద్రుఁడు విన్నవింపఁగాఁ బరమేశ్వరుఁడు, కలియుగమున ముందు నందికేశ్వరుఁడు, వీరశైవ మతోద్ధరణమునకయి, బసవేశ్వరనామమున నవతరించి, యనుదినము లక్షతొంబదియాఱువేల చరలింగముల నర్చించుననియు నప్పుడు వారి వస్త్రముల నుదికి వారిని సేవింపు మనియు నప్పుడు నీ చేతులతీట తీఱఁగలదని యాదేశించె ననియు వీరశైవలోకమందలి యైతిహ్యము.

మడివాలు శబ్దమునకు శుభ్రములగు మడి వస్త్రములఁ గూర్చువాఁడనియే యర్థము. ఈ కృతికర్త బత్తెనయ్యగారు కూడ మడివాలు మాచయ్య వంశజులే. పాలకురికి సోమనాథుని ద్విపద బసవపురాణము చతుర్థాశ్వాసమున మాచయ్యగారి చరిత్రము కొంత వర్ణితమయినది. దానిని బ్రధానాధారముగఁ గొని కృతికర్త మఱికొన్ని విషయములఁ గూడ సేకరించి భక్తియే ప్రమాణముగ నీ గ్రంథమును రచించిరి. భాషాపాండిత్య మంతగా లేనివారగుట భాషావిషయక దోషము లిం దెక్కువగా దొరలినవి. శైలి కూడ హృదయంగమముగ లేదు. ఈ విషయమును గ్రంథకర్తయు, పండితాభిప్రాయ మొసంగిన గండికోట రాజేశ్వరయ్య దేవరగారుకూడ చెప్పియేయున్నారు. మాచయ్య భార్య సీతలాదేవి యని పేర్కొని యామె జననవృత్తాంతాదికములఁ గూడ నిందుఁ జేర్చినారు. గురుమూర్తియైన వీరభద్రుఁడు మాచయ్యకుఁ బ్రసన్నుఁడై యాతనికి ముప్పదిమూఁడు బిరుదము లొసంగెనని వాని నామములను గూఁడ వివరించిరి. మాచయ్య నారాధ్య దైవతముగఁ గ్రహించి తత్పూజార్థమయి హృదయాదిన్యాస, ధ్యానాదిక శ్లోకముల నిందుఁ జేర్చిరి. ఇవి యిందలి క్రొత్త విశేషములు. ప్రసక్తానుప్రసక్తముగ బసవేశ్వరునియు నాతని యేలిక కలచుర్య బిజ్జలునియు జనన వృత్తాంతాదులనుగూడ గృతికర్త యిందు వివరించినారు. బిజ్జలుఁడు వీరభద్రునిచే శిక్షింపఁబడిన దక్షుని యంశతో, శివాజ్ఞచే కనకద్వారావతీనగరాధీశుఁడగు బిందుదర్పుఁడను రాజునకు బిందుమాలినియను పట్టమహిషికినుదయించిన నందనుండని యిందుదాహరించిరి. ఇది కృతికర్త కల్పించినదో యిందు కేమైన నాధారములున్నవో తెలియదు. ఇట్లు బసవపురాణము నుండి తెలియరాని పెక్కు విషయముల నిందు గ్రంథకర్త చేర్చుట ప్రశంసనీయము.

(2) శ్రీకోగంటి దుర్గామల్లికార్జునరావుగారు, కృష్ణాజిల్లా పామర్రునందు భారతీసమితి, భారతీసన్మానసంఘము నను విద్యాసంస్థల స్థాపించి

వాని కార్యదర్శిగా చిరకాలమునుండి సాగించుచున్న సారస్వతసేవ, కవిపండిత కళాకార సన్మానాదికములు భాషాసేవకులకు సుపరిచితములు. వారి భాషాసేవ బహుముఖములయినది. పద్యలేఖావళి (ప్రథమ భాగము) అను పేరితో నింతకుమున్ను వీరు ప్రకటించిన చిన్నపొత్తముపై సమీక్ష యీ పత్రిక పూర్వసంచికలలో చేసియుంటిమి. గద్య లేఖావళియను ప్రకృతికృతిలో కొన్ని ముఖ్యావసరములందు వీరు బంధుమిత్రులకు వ్రాసిన గద్యలేఖలు ప్రకటితములయినవి. అందుఁ గొన్ని భాషావిషయములకుఁ బ్రసక్తించినవియుఁ గలవు.

(3) శ్రీమతి అన్నపూర్ణాదేవి శ్రీ దుర్గా మల్లికార్జునరావుగారి సతీమణి. సహధర్మచారిణీశబ్దమున కన్వర్థముగ వర్తిల్లిన గృహిణీమణి. ఆమె కొన్ని నెలలక్రిందటఁ బతిని దుఃఖసాగరమున ముంచి యకాల నిర్యాణమంది స్వర్గమునలంకరించినది. మల్లికార్జునరావుగారీమె యండ దండలచేత తమ సారస్వతసేవ చేయఁగల్గుచుండిరనుట నిక్కువము. ఆమె యకాలనిర్యాణమునవారర్ధశరీర విరహితులయి దుఃఖాక్రాంతులయినారని చెప్పనవసరములేదు. ఆమె యకాలమృతికి వగచుచు, మల్లికార్జునరావుగారితో పాటువారి దుఃఖానుభవమును బంచుకొనుచుఁ బలువురు బంధుమిత్రులు, భాషాసేవకులు పంపిన సానుతాపసందేశ పూర్వక లేఖ లిందు ప్రకటితమయినవి. అవి కరుణారసప్లుతములు.

(4) శ్రీ వేంకటనరసయ్యగారు, పామఱ్ఱులో దుర్గామల్లికార్జున రావుగారు స్థాపించిన విద్యాసంస్థల కధ్యక్షత్వము వహించి వారికేఁ బలువిధముల సహకరించిన పండితప్రకాండులు. వీరిది పండితకుటుంబము. తెలుఁగులెంక, అభినవతిక్కనయని పేర్వడసిన శ్రీ తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారి భాగినేయులు. మేనమామ యంశలు కొన్ని వీరికిని సంక్రమించినవి. నరసయ్యగారి తండ్రి వేంకటసుబ్బయ్య గారు తెనాలితాలూకా పెదపూడిలోఁ జిరకాలము పౌరాణికులుగా ప్రజారంజన మొనర్చి పురాణము సుబ్బయ్యగారను ప్రశస్తిగాంచిన

వారు. సీతారామమూర్తిగారి శక్తియుక్తులకు వీరి శుశ్రూష కొంత వఱకుఁ గారణమనియుఁ జెప్పఁదగును.

నరసయ్యగారు సహజముగ దేశభక్తియుక్తమయిన హృదయముగలవారు. స్వరాజ్యసంపాదనార్థముగ గాంధిమహాత్ముఁడు సాగించిన సత్యాగ్రహోద్యమములలో వారిశంఖారావముల విన్నంతనే, నరసయ్యగారు చదువునకు స్వస్తిచెప్పి యౌవనముననే యాయుద్యమమునఁ జేరి పలువురు దేశనాయకులతోపాటు బ్రిటిషుప్రభుత్వమువారి పరిపాలనములోఁ గారాగృహవాసము లొనర్చి పలుకష్టముల ననుభవించిరి. జైలునుండి విడుదలచెందినపిమ్మట వీరు మరల విద్యాభ్యాసమునకుఁ గడంగి యుభయభాషాప్రవీణ పరీక్షయందు త్తీర్ణులయి, చిలుకలూరుపేటలో ధార్మిక వైశ్యులు కొందఱు నెలకొల్పిన యున్నతపాఠశాలయందుఁ బ్రధానాంధ్రపండితులుగ 1946 సంవత్సరమునుండి పనిచేసి పలువురు విద్యార్థులకు విద్యాప్రదాన మొనర్చి, వారియందు దేశభక్తిబీజములనాఁటి జాతీయతాభావసంయుతులుగ వారిని తీర్చి దిద్దినారు. సంస్కృతాంధ్రములందేగాక హిందీమున్నగు నితరభాషలందును జక్కని ప్రావీణ్యము గడించిరి. మధురకవితాశోభితులయి చక్కని మధురకృతులు పెక్కింటిని రచించి మధురకవీత్యాదిబిరుదముల నంది విరాజిల్లిరి. అన్నిటికన్న మిన్నయగు వీరి గుణవిశేషము. వీరవలంబించిన యాజన్మనైష్ఠికబ్రహ్మచర్యము. అది లోకమున కాదర్శప్రాయమయినది. చిలకలూరుపేటలో పాఠశాల హాస్టలునందే వీరు నివాసముగా నుండెడివారు. వీరు వసించెడి గది యొక పుస్తకభాండాగారముగ విలసిల్లుచు నిరంతరము శిష్యజనసమాకీర్ణమై పూర్వగురుకులముల స్మరింపఁజేయుచుండెడిది. వీరి రజతోత్సవమును శిష్యవర్గము వైభవోన్నతముగ నెఱవేర్చియుండిరి. షష్టిపూర్తిగాకమున్నే 1967 మార్చినెలలో నొకనాఁటిరాత్రి పాఠశాలావసతియందే కతిపయ శిష్యజనసమక్షమున సునాయాసముగ నసువుల విడిచి భీష్మునివలె స్వచ్ఛంద

నిర్యాణము చెంది దివంగతులయి భాషాలోకమును దుఃఖసాగరమున ముంచివేసినారు. దుర్గామల్లికార్జునరావుగారి కుడిభుజము కూలిపోయి నట్లయినది. భార్యావియోగమునకుఁదోడు వారికి సహచరవియోగము దుర్భరమని చెప్పనక్కఱలేదు. నగసయ్యగారి యకాలనిర్యాణము భాషాప్రపంచమునకుఁ దీఱనిలోటు కలిగించినదనుట నిక్కువము. సీతారామమూర్తిగారు "శోకయోగి" యను శీర్షికతో రచించిన సంతాపపూర్వకపద్యములతో పాటు పలువురు పండితులు, కవులు, బంధుమిత్రులు వివిధశీర్షికలతో వ్రాసిపంపిన పద్యములు, పెదపూడి, కుఱుమద్దాలి మున్నగుచోట్ల జరిగిన సంతాపసభలందలి యుపన్యాసములతో నీసంచిక సంతరింపఁబడినది. భాషాభిమానులెల్ల దీనిని శ్రద్ధతోఁ బఠించి నగసయ్యగారి యెడఁ దమ శ్రద్ధాంజలుల సమర్పించుట యవసరమని హెచ్చరించుచున్నాము.

(౬) వీరశైవమతోద్ధారకుఁడు, భక్తిభండారి, మహాత్మాబసవేశ్వరుని యష్టమశతవార్షికోత్సవములు భారతదేశమంతట 1967, 1968 సంవత్సరములలో వైభవోన్నతముగ నిర్వహింపఁబడుచున్నవి. మైసూరు రాష్ట్రప్రభుత్వ యాజమాన్యమున, బసవకల్యాణ, కూడల సంగమ క్షేత్రములందు 26-12-67 to 2-1-68 తేదీలందు జరిగిన మహోత్సవములఁ గూర్చి యీపత్రిక గతసంచికలో నొక వ్యాసమును పరిషత్పత్రమునఁ గాన్కగాఁ బ్రకటించియుంటిమి. రాయలసీమ బసవసమితి పక్షమునఁ దధ్యక్షులు శ్రీ జోగప్పగారీ ప్రత్యేక గ్రంథము ప్రకటించుట ప్రశంసనీయము. అనంతపురములో బసవసమితి మున్నగు పెక్కు ధార్మికసంస్థల స్థాపనమునకుఁ గారకులయి, దానవీరులని ప్రఖ్యాతివడసి 9-4-67 తేదీన ఆకస్మికముగ శివాధీనమయిన శివశ్రీ గోంగడి రామప్పగారి స్మారకపూర్వకముగఁ గూడ నిది వెలువడుట ముదావహము. శ్రీ జోగప్పగారు సంస్కృతాంధ్రాంగ్లకర్ణాటభాషాకోవిదులు. భారతీయమతతత్త్వములను సమగ్రముగ సమీక్షించి సమన్వయముచేసిన విద్యాధికులు. బసవజయంతి సందర్భములలో నింతకుమున్నే వీరు బసవేశ్వరుని జీవితతత్త్వము, లోకమునఁ గాలఁ

డొసర్చిన సందేశముల యౌన్నత్యమును వ్యక్తీకరించుచుఁ జిన్నిచిన్ని పొత్తములను ఆంధ్రాంగ్లకర్ణాటభాషలలోఁ బ్రకటించుచు వచ్చినారు.

రాయలసీమ డెవలప్ మెంటు కమీషనరుగా పనిచేయు నప్పుడు వీరు కావించిన నిర్మాణప్రణాళిక ప్రకారమే ప్రభుత్వమువారు శ్రీశైలక్షేత్రోద్ధరణ కార్యములకుఁ బూనుకొని ప్రజలతోడ్పాటుతో శ్రీశైలమునకు మోటారుబస్సు ప్రయాణసౌకర్యములను గలిగించినారు. తత్ఫలితముగనే నేఁడు శ్రీశైలము నిత్య యాత్రాస్థలముగా పరిణమించినది.

ప్రస్తుతము శ్రీశైలవీరశైవసంఘాధ్యక్షులుగా అనంతపురము, గుంతకల్లు, శ్రీశైలములలో భారతీయవిద్యాపీఠమున్నగు ధార్మిక సాగిస్వతి సంస్థల నెలకొల్పి, భాషాసేవ, వీరశైవమతసేవ గావించుచున్న మహనీయులు. ప్రకృతకృతి హిందూమతతత్త్వమును బసవేశ్వరుని జీవిత తత్త్వసందేశాదికములను బాగుగా గ్రహింపఁదలంచువారికి బహువిధముల నుపకరించు నమూల్యగ్రంథము. జాగప్పగారి యుపన్యాసములు, వ్యాసములేగాక, భారతదేశ ప్రధాన న్యాయమూర్తి P. R Gajendragadgar, బీహారుగవర్నరు, R. R. Divakar Professor, R.R. Ranade, ఆచార్య వినోబాభావే మున్నగువారు బసవేశ్వరునిగూర్చి వివిధసందర్భములలో నాంగ్లమునగావించిన భాషణములు Sir John harshall, Doctor S. Radha Krishnan గారల వ్రాతలనుండి శైవమతమునుగూర్చియుద్ధరింపబడినరచనములు మున్నగు నెన్నియో యిందుఁ జేర్చబడినవి. బసవేశ్వరుని వచనములకుఁ గొందఱుపండితులుఆంగ్లమునను, ఆంధ్రమునను గావించిన యనువాదములుగూడఁ గొన్ని విపులముగఁ జేర్పఁబడినవి. పాల్కురికి సోమనాథుని బసవోదాహరణము (సంస్కృతము) బసవలింగనామావళి (కన్నడము) నిందు ముద్రింపఁబడినవి. బసవేశ్వరునిగూర్చి, తత్సంబంధిక వాఙ్మయమునుగూర్చి వివిధవిషయము లెఱుంగఁ గోరువారికిది దర్పణము. మతాభిమానులు, భాషాభిమానులు దీనికి స్వాగతమొసంగుదురుగాక యని యభిలషింతుము,

# గగన గంగ

## ప్రథమాంకము—ప్రథమ రంగము

[ ప్రదేశము:-అమరావతిలో నందనవనాంతరము ]

ప్రవేశము:—పార్వతి, సఖి తమాల

పార్వతి:—నీవు నూరు చెప్పుము, వేయి చెప్పుము, వారి వర్తనములు కంట బడినప్పటినుండియు నా కనుమానముగ నేయున్న దే తమాలా! లేనియెడల యపరిచితురా లగునంగనపై నన్యాయముగ నట్టియప నింద మోపుదునా ?

తమాల:—దేవీ! ఆమెమాట నటుంచుము. కామవిజేతయగు శంకర దేవునిగూడ శంకింపవచ్చునా ? ఔను. శంకింపకుండుటకు నీశక్య మగునా? అంగనల కందఱకును నాజన్మసిద్ధము లగు ననూయ, యనుమానమును నిన్నుమాత్రము విడుచునా ? ఎంతటి యున్నత గోత్రమున నుద్భవించిన నేమి ? సర్వజ్ఞుని సహధర్మిణివైన నేమి?

పార్వ:—(నవ్వుచు) కామవిజేత- అబ్బా! కామవిజేత! ఎంతటి వీరబిరుదము. చెఱకువిల్లు చేబూని- తుమ్మెదనారి సారించి యొక్కకుసుమ బాణము విసరి తెయితక్క లాడించిన కాముఁడు గాఁడా? పోనిమ్ము. అట్టి పరమసుకుమారశరీరుని భస్మము గావించినందుల కేనా? ఫాల లోచనున కీవీరబిరుదము. తమాలా! అపుడు జయలక్ష్మి యెవ్వని వరించినదో నే నెఱుఁగనా? లోకము లెఱుంగవా ?

తమా:—తెలియకే మమ్మా! పంచశరునిదే పైచేయి. చచ్చియు సాధించినా డామహానుభావుడు.

పార్వ:—(నగుచు) చెలీ! నీ వీ యయ్యగారిని నే నకారణముగ నే శంకించుచుంటి నని యందువా ?

తమా:—పోనిమ్ము దేవీ! బలీయములగు నిదర్శనము లున్నవి గాబో లును చూపరాదా ?

పార్వ:—బలీయము లనఁగ?

తమా:—అనఁగ నేమో నీకు తెలియదా? నీకొక్క తెకు గాక యా నిదర్శనము లాలకించిన పలువురు బుద్ధిమంతులకుగూడ ననుమాన మును గలిగించునవి. తెలిసినదా ?

పార్వ:—ఆఁ, అటులనేమి ?

తే. గీ. ప్రౌఢరసికుల శృంగార భావగతులు
సులభముగ గోచరించునే చూపరులకు
ప్రౌఢకావ్యచమత్కార భావరీతిఁ
బండితులెకాని యితరు లేర్పరుపగలరె ?

కావున తమాలా! ఆ మహాసభలో నందఱకనుల గప్పి యామెయు నభవుడును నాడిన యభినవశృంగారనాటకమును దెలుపు మని యెంత తేలికగ నడిగితివే. వారి ప్రౌఢిమ.........

తమా:—దేవీ! వారు, వా రని పలుమారు పలుకుచున్నావు. "నా నాథుడును నామెయు" నని యనరాదా ? ఇరువురి సంయోగము నీవే యంగీకరించి వా రని కలిపి మాటాడుచున్నావు సుమా.

పార్వ:—(కోపముతో) నీపరిహాసములు హద్దును దాటుచున్నవి సుమా తమాలా!

తమా:—నాపై యలిగెద వేల? దేవీ! ఏదీ-ఏదీ-నీవు సూక్ష్మబుద్ధివి గదా, ఏదీ నాటి జయంతుని జన్మదినోత్సవసమయములో, సగ్రాస నాధిపతి మైన యార్యామనోహరునకును, నా యూరును పేరును నింతదనుక మనకు దెలియని యాసుందరీమణికిని నడుమ నడచిన యనంగవికారచేష్టలు. ఏవీ? వినిపింపుము.

పార్వ:—చెప్పవలయునా? ఆవింతపనుల నాచేత బలికించి కులుకదలచి తివా? సరియే వినుము. వైజయంతసభాభవనమున నాదక్షిణద్వా రము చెంత నిరువురుసుంశరుల బుజములపై జేతుల వైచి యెడమ బుజమువీాదకు రవంత మొగ మొరుగనిచ్చి, యా వింతవింత

చూపుల వర్ణింపలేను. ఏమి మోరచూపులు! ఏమి చిఱునవ్వులు! ఏమి పయ్యెదసవరింపులు! ఏమి కనుమోడ్పులు!

తమా:—ఇది చూచియేనా? ఈమాత్రమునకేనా యింత వ్యాఖ్యానము. భక్తులు పరమేశ్వరుని పరమానందముతో సందర్శింపగూడదు కాబోలును.

పార్వ:—(హేళనముగ) ఔను. పరమేశ్వరుడు భక్తతాండ్రతో నైక్యమొంది బ్రహ్మానందమును ప్రసాదించుటయు పరమధర్మ మని సిద్ధాంతీకరింపక యంతటితో విరమించితి వేమే? ఊఁ కానిమ్ము.

తమా:—దేవీ! నీయుపన్యాస మగువఱకును మఱి మాఱుపలుకను లెమ్ము. తరువాత నేమిజరిగినదో చెప్పుము.

పార్వ:—ఇఁక చెప్పున దేమి? ఆసుందరి ప్రేమపూర్వకముగ బలుమారు పంపుకొనిన కటాక్షవీక్షణకువలయమాలికను పొంగుచు స్వీకరించినాడు పరమేశ్వరుడు. వారివర్తనముల గాంచ సహింపజాలక చల్లగాలి కని వంకబెట్టి యావలి కేగితిని. నా యసహనమును గుర్తించినది కాఁబోలును, వామభాగముననున్న వనితచెవిలో నేనేమియో గుసగుస లాడి విఱుగబడి కిలకిలమని నవ్వినటులుగూడ నా యనుమానము.

తమా:—అనుమానమనియే కాని నిశ్చయమని చెప్పజాలవనుమాట.

పార్వ:—నిశ్చయము గాకేమి? సందేహము లేదు, నన్ను జూచియే.

తమా:—ఊఁహూ.

పార్వ:—తరువాత మహేంద్రుడు త్రిమూర్తులతో దిక్పాలకులతో నారదవాచస్పతిమిత్రులతో రహస్యకార్యాలోచనసభ గావించుటకై యేగుటచే జన్మదినోత్సవసభ యంతటితో ముగిసినది. అటు పిమ్మట నాకాంత యింతవఱకును నాకంట బడలేదు.

తమా:—అమ్మా! ఆమె యెచటిదో? ఏరికి సంబంధించినదో? యెవ్వరినైన నడిగి తెలుసుకొనకపోతివా?

పార్వ:—ఊరకొంటి ననుకొంటివా ? నా పరియత్నలోపము లేదు. ఆదక్షిణభాగమున నున్నవా రన్నిలోకములనుండి యాహూతింప బడిన నదీమతల్లిక లనిమాత్రము తెలిసికొంటిని. ప్రత్యేకించి గ్రుచ్చి గుచ్చి యొకకామినినిగూర్చి పదింబదిగ నడిగినచో నపహాస్య ముగా నుండునని యూరకొంటిని.

తమా:—ఔను. కాని అమ్మా! జయంతకుమారుని జన్మదినోత్సవసమ యమున నీ రహస్యాలోచనసభ లేమిటమ్మా.

పార్వ:—ఇదమిత్థ మని చెప్పజాలను గాని తఱచుగ దానవులు స్వర్గ ముపై దండెత్తి వచ్చుచున్నారట ! వారి నివారించునుపాయ మాలోచించుట కనుకొందును. ఏమే తమాలా ! ఈ విషయము నీచెవుల బడినదా ?

తమా:—ఏ విషయము ?

పార్వ:—దానవగూఢచారు లమరావతీపురమున కామరూపులై గల యదిరుగుచు నమరులలో నంతఃకలహబీజముల నాటుచున్నారట !

తమా:—(ఆశ్చర్యముతో) ఆఁ. ఏవిధముగ ?

పార్వ:—సంగీతశాస్త్రమున నారదున కిడినగౌరవస్థానమును తుంబు రున కొసంగుట లేదట. అపార్థము సూచించు కిన్నరకింపురుష నామములతో దేవయోనుల బలుకుచున్నారట.

తమా:—త ప్పేమున్నదమ్మా ? కిన్నరులను కిన్నరు లనక మతే మందురు ?

పార్వ:—కిన్నరు లనగ కుచ్ఛితనరు లట, కింపురుషు లన కుచ్ఛితపురు షులని యర్థమట. ఇట్టి యపార్థముల సూచించునామముల దమ జాతికి దిక్పాలు రుంచిరట. ఇట్టి నీచనామముల నింతదనుక నవివేక ముచే సహించిరట. దిక్పాలురతో బాటుగ దమకుమాత్ర మేల హవిర్భాగముల నధికారము లే దని బృహస్పతులవారిని నిలువబెట్టి నిందాపూర్వకముగ నడుగుచున్నారట.

తమా:—ఓహో ! విచిత్రవిప్లవమే సురలోకములో తలచూపినదే.

పార్వ:—ఈనూతనవిప్లవముగూడ రహస్యసభకు గారణమై యుండ నచ్చును.

తమా:—సభావృత్తాంతము నయ్యగా రేమియు నీకు దెలుపకుండ నుండరే.

పార్వ:—ఏదీ! అడిగి తెలిసికొనుట కవకాశ మేదీ ? సభ చాలించిన యుత్తరక్షణముననే కైలాసప్రయాణమునకై సన్నాహము లొనరించుకొనిరి గాదా. అదియునుగాక యీయమ్మవారికటాక్ష మావేశించినదిమొద లయ్యవార లస్తిమితులై యున్నటులే తోచినది. ఆయన పరధ్యానమే నాయనుమానము నభివృద్ధి జేసినది. ఆయనుమానము మనసున నుంచుకొనియే వినాయకునిగూడ తండ్రివెంట బంపితిని.

తమా:—అంత యనుమానించినదాన నయ్యగారి ననుసరింపక యీగిపోతి వెందుల కమ్మా ?

పార్వ:—నేనే కోరుకొని యిట నాగితి ననుకొంటివటే! అది యంతయు నతిచమత్కారముగ దటస్థించినదిలే.

తమా:—శచీపురందరుల బలాత్కారము ప్రబలమగుటచేగాబోలును.

పార్వ:—అతిథు లందఱును నట్టిబలాత్కారములకు బరిహారములు చెప్పి తమతమతావుల కేగలేదా? "నేను వెడలక తప్పదు. వలయు నెడల నాయర్ధాంగి నిందు కొంతకాల ముంచుకొనిన నాయాటంకమేమియును లే" దని మీ యయ్యగారే వారిపట్టుబట్టుటకు బలమును జేకూర్చి తమమార్గమును నిష్కంటకముగ జేసుకొనినారు.

తమా:—మనప్రయాణ మెప్పుడు ? దేవీ !

పార్వ:—ఎప్పుడో నా- శేపీ- శచి నంగీకరింపజేసితిని. ప్రయాణసన్నాహములకై మనభృంగిని నియోగించితిని. ఏమే తమాలా! ఇట్టిసను

యములో నాకాంతు నేకాకిగ నుంచుట కాపురమును గంగపాలు గావించుటయే కాదా ?

తమా:—ఊరకొనుమమ్మా ! నీనీడను జూచి నీవే బెదరుచున్నావు. పట్టుపురుగువలె నీయనుమానతంతువులచే నీవే బంధించుకొనుచున్నావు. ఆనాడు పెండ్లియాడ నని పట్టుదలతో తపమునకు గూర్చుండిన యాసర్వేశ్వరుడు నీపై మోహముచే నిష్ఠ నంతయు విడనాడి నిను చేపట్టినాడు. అంత ప్రేమ యింతలోనే యంతరించినదా ?

పార్వ:—ఔను. కోరి పెండ్లాడితిని గావుననే యింత కోపమున్నినది.

తే॥ గీ॥ కమ్మతేనియ లానంగా దమ్మికడకు
తుమ్మెదయె పోవగును గాని తమ్మిపూవె
తుమ్మెదను గోరి యేగుచో దోలుత, దాని
పైన గౌరవ ముంచునే బంభరమ్ము ?

తమా:—నీవెఱ్ఱియే కాని యాతరుణి నీకంటె జక్కగ నుండునటమ్మా!

పార్వ:—నీ యిచ్చకముల కేమిగాని తమాలా! ఆమె సుందరి కా దని యెవ్వ రనగలరే. నీవు చూడలేదు గాని. అదియుగాక యందము నకును ప్రేమించుటకును ననుబంధ మేమి ? సౌందర్యము మనము ననే కాని తనువున లే దని నీ వెఱుగవా ?

తమా:—అమ్మా ! తొందరపడి మనసును వ్యాకుల మొనరించుకొనకుము. ఇంకను దగినసాక్ష్యములు లభించినగాని ... ...

పార్వ:—ఇంతగ జరిగినను నీకు నమ్మకము కలుగదేమే తమాలా !

చ॥ తన సకలార్థ మొక్కనికి ధారను బోసి విచారలేశముం
గనక సుఖింపగా నగును; కానక కానక గన్న యొక్కనం
దను మనసార నొక్కవనితామణిచేతుల బెట్టవచ్చు; హా !
తనపతి నన్యకాంత కిడి తాళగ శక్యమె! యెట్టిదానికిన్ ?

తమా:—దేవీ ! ఎందుల కీయాకాశసౌధనిర్మాణములు. నామాట వినుము.

(నేపథ్యమున)

ఆర్యామహాదేవిగా రచట సభద్వితీయ లై యున్నారు దేవీ!

పార్వ:—ఎవ్వరే! తమాలా!

తమా:—(చూచి) ఇంద్రాణి నీకొఱ కదిగో వచ్చుచున్న దమ్మా!
లెమ్ము. లెమ్ము. చెమరించినకనుల నొత్తుకొనుము.

పార్వ:—(లేచి) తమలా! మన మెదు రేగుదము. నడువుము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

---

## ప్రథమాంకము—ద్వితీయ రంగము

(ప్రదేశము:—కైలాసము)

(ప్రవేశము:—శంకరుడు పర్యంకముపై)

శంక:—అబ్బా! ధృవసూచికాయంత్రమువలె నామన మెటు మరలించినను మందాకినిదెసకే మొలుసూపుచున్నదే. నేనేమి చేయగలను? ఇట్టి చాంచల్య మెన్నడైన నెఱుగుదునా? (కను లరమోడ్చి)ఆహా!

మ. కడు మధ్యందినభానుమండలము వంకన్ దృష్టి సారింప నే
కడ గన్గొన్నను భానుమండలములే కన్పట్టుచందాన మే
ల్పడి ని న్గాంచినదాది నీమధురలీలామూర్తియే చాల గ
న్పడి నాకన్నులు మూటికిన్ దివిజగంగా! విందొనర్చుం జుమీ.

(భృంగి ప్రవేశించును.)

భృంగి:—(చేతులు ముకుళించి) దేవదేవుని దివ్యపాదారవిందములకు సేవకపరమాణువు భృంగి నమస్కరించుచున్నాడు.

శంక:—(ఉలికిపడి లేచి) ఆఁ నీవా? భృంగీ! నీవా? వచ్చితివా? శచీదేవి మీయమ్మ నింతలో విడుచునని యనుకొనలేదు సుమా. విరసముగ విదలించుకొని యార్యామహాదేవిగారు కైలాసముపై జెంగ పెట్టుకొని విజయంచేసినారా? ఏమి, ఇంతేనా?

భృంగి:—(నవ్వుచు) దేవరయానతికి దేవదేవుని మనోవృత్తికి తిరుగున్నదా?

శంక:—ఆఁ ఆ. నేను నగరాజతనయను నాకడకు రమ్మని వేగిరించితినా? ఆమె తన యాశయము నీవిధమున నాపైకి మరలించినదా? శచీపురందరు లతిబలాత్కారము చేయుటచే మోమోటముచే గొంతకాల మామెను నిలుపుకొన నంగీకరించితి. అందుపై నార్య కొంత జెట్టుసరి చేసి యాగిపోయినది. ఇందు నావేగిరపా టేమి యున్నది?

భృంగి:—(నవ్వుచు)నగవైరియింట నగరాజకుమారి నుంచుట యేలినవారికిమాత్ర మే మంత భావ్యమైన పని?

శంక:—(హసించి) మా ముద్దులబావ మైనాకునకు వజ్రి పక్షముల జెక్కక విడిచిపుచ్చినాడు గదా. అక్క కింక యమరేంద్రునిపై నాగ్రహకారణ మేది?

భృం:—అందుచేతనే యనుకూలు రగుటచేతనే యార్యామహాదేవి యమరలోకమునుండి యింకను ప్రయాణభేరి మ్రోయింపదలచుకొనలేదు.

శంక:—(నవ్వి) ఓరీ మాయావీ! తోడుకొని రాలేదని తొలుతనే చెప్పలేదేమి?

భృంగి:—నేను నివేదింపకమున్నే యేలినవా రేమేమియో యేకరువు పెట్టసాగినారు. నన్ను నోరెత్తనిచ్చిన గదా. ప్రభువుల ప్రసంగ మధ్యమున సేవకుడు విసువు విడిచి వినవలసినవాడే కాని, పెదవి

గదిపినమాత్రమున నాపూటనుండి యాతని యుద్యోగమున కుచ్చాటనమని యెఱుగనా ?

శంక:—అబ్బా! ఎంత ప్రభుభక్తి. ఎంత సేవకధర్మాసక్తి. పోనిమ్ము. భృంగీ! నేను ప్రసంగము చాలించినతరువాతనైన నెఱిగించినావా?

భృంగి:—లేదు స్వామీ! లేదు. విన్నవింపకుండుట కపు డొకనూతన కారణ మప్పుడు వచ్చినది.

శంక:— ఏ మా నూతనకారణము ?

భృంగి:—స్వామివారి యాదిమోపన్యాస మాలకించినంతనే యంతయు నవగత మైనది.

శంక:—(వెలవెలబోయి) ఏ మది ?

భృంగి:—ఏ మున్నది? ఇంతలో మాయమ్మ మఱలి వచ్చుట దేవర దివ్యచిత్తమున కంగీకారము గాదని.

శంక:—ఇదియేనా నాధోరణిలోని సారాంశము? ఆహా! ఎంతరసజ్ఞుడవోయి! ఎంతటిపండితుడ వోయి!

భృంగి:—సంఘుల విడగొట్టి, స్వభావమునకు స్వస్తి చెప్పి, సత్యమును సాగనంపి, మాటపట్టింపుచే మహాదేవులు మఱియొకయుద్ధమును సాయించినచో సేవకుడు సావధానముగ విన సంసిద్ధుడే.

శంక:—(కోపముతో) లోకత్రయమును నేకఛత్రముగ బాలించు సార్వభౌముకు మనయందు మహాగౌరవముంచి మఱియు మఱియు ప్రార్థింప మోమోటము లేకుండ............

భృంగి:— భారతీచతురాననులకును, నితర దేవతామిథునములకును గూడ నట్టిమోటంకము లేకపోయినది గాబోలును. వారందరును విరసతనే వెల్లడించుకొని వెడలియుందురు. ఇదియే కాదా? శంకర దేవులు సెలవీయ దలంచుకొనినసమాధానము.

శంక:—భృంగీ! నీ వేదియో మనసునందుంచుకొని మాటలాడుచున్నావు. అమరరాజదంపతుల యాశయము నంతచులకనగ త్రోసివేయలేక యార్యనైన నచట విడిచిన నన్ను బోనిచ్చెద రను నాసచేత "అర్ధాంగి నాపుచేసిన నాయాతంకము లేదు. నేను వెడలక తప్ప" దని మాటవరుస కటులంటిని. అంతమాత్రముకే యార్య మెత్తబడిపోవలయునా? ఏదియో వంక బెట్టి ఆనుగూడ రాకూడదా? శా దనలేక మోమోటమిచేతనో చిరకాలమునకు పరదేశ మేగుటచే నచటివింతల నింకనుజూడ నభిలాషచేతనో యాగినది. నేనేమి చేయుదును? ఆమె యెప్పుడు కోరిన నపుడు తోడుకొని వచ్చెద వనియే కాదా నిన్నచట నుంచి వచ్చితిని.

భృంగి:—శాసనము బలవత్తరమైనది. కావున కాత్యాయనీదేవి కాలు గదుప వీలులేదు గదా.

శంక:—(కోపముతో) నే నామెను శాశింపలే దని యెంతగ చెప్పినను మతిలేక మరలమరల పాడినపాటనే పాడెద వేమిరా!

భృంగి:—మీరు శాసించి రని నేనుమాత్ర మనుచుంటినా?

శంక:—నేను గాక యిాశ్వరకుటుంబినిని శాసించుసాహసు లెవ్వరు?

భృంగి:—కాలశాసనము.

శంక:—నీ నాలిముచ్చుమాటలు నాకేమియు నర్ధమగుటలేదు. కాలుడు కాత్యాయనిని శాశించునా?

భృంగి:—ఏలినవారు కాలకాలురని యెఱుగనా? కాలుడు గాదు. కాలము.

శంక:—విస్పష్టముగ జెప్పకున్న నీతల బగులగొట్టెదను.

భృంగి:—కాలశాసనబద్ధురాలై యామె ప్రయాణము మానుకొనినందులకు నాశికముకు వక్కలు చేయుదురా? ఇదేమిధర్మమయ్యా! సర్వజ్ఞుడవు, ధర్మనిష్ణాతుడవు. ఏకవస్త్రయగు నుమాదేవి యెట్లు ప్రయాణించు నయ్యా!

శం:—(అట్టహాసములో పెన్ను తెరచి) ఓరి నిర్భాగ్యుడా! ఆమాట నాదియందే చెప్పక యింత గిజగిజ లాడితివే. ఊఁ హూఁ, అందుచే నార్య యాగమనకాలము మఱిమూడుదినములు ముందునకుద్రోయ బడిన దనుమాట. ఈమాటను మూట్టగట్టుకొని యిటకు వచ్చితివా? అన్నియవశిష్టములును దీరిన వెనుక నామెను దోడుకొని రాలేక పోయితివా! శ్రమపడితివే.

భృంగి:—ఇంతకాల మామె నంటివిడువనివా రగుటచే నేమియాతు రత నందుచున్నారో వీరని యా యమాయిని నన్ను తొందర పెట్టి యిటకు దోలినందులకు నాకు ప్రాయశ్చిత్తమైనది.

శంక:—భృంగీ! నేను నీమాటలు కొంత విపరీతముగా నున్నవి. నాపై నామె కాగ్రహము గలుగ లేదు గదా!

భృంగి:—ఆమెకు గోపమును లేదు, తాపమును లేదు, అణుమాత్ర మైన ననుమానమును లేదు,

శంక:—అనుమాన మనుచున్నావేమి? నాయందేనా? భృంగీ! నాయం దేనా?

భృంగి:—ఆమె పరోక్షమున జరిగినదానిగూర్చి యార్య మెటు లను మానింపగల దయ్యా!

శంక:—(ఆశ్చర్యములో) ఆఁ, ఆమె పరోక్షమునమాత్ర మేమి జరి గినది? అటులైన నీవే యనుమానించుచుంటి వనుమాటయేనా?

భృంగి:—అపారముగా ప్రత్యక్షనిదర్శనములు లభించినపుడుగూడ...

శంక:—నిదర్శనములా? భృంగీ! మాటాడవేమి, నీకు లభించినవా?

భృంగి:—మహాత్మా! చౌర్య మారుమాసముల కనంతరమునను, జారత్వ మారుమాసములకు ముందుగను బయల్పడునని యందురు. దీని మనము నమ్మవచ్చునా?

శంక:—సరి. సరి, తెలిసినది. బోధపడినది. ఇది నీబుద్ధి కాదు. ఆర్యయే నీ కీమహామంత్ర ముప దేశించినది. దానినే నీవిపుడు పునశ్చరణము గావించుచున్నావు.

భృంగి:—అయ్యో! అయ్యో! ఆమహాసాధ్విపై నీ యుపనింద నేమాత్రము వైచినను నాపాతకము నాపై కంఠమున జుట్టుకొనక మాన దు. నేను కనులార గాంచినది, చెవులార నాలకించినది......

శంక:—ఏమి చూచితివి? ఏమి వింటివి?

భృంగి:—నాపరిమాణవిశేషముల బరిపూర్తిగ నాలకింపని దే నాపలుకులలోని పరమార్థము దేవరకు తెలియుజాలదు.

శంక:—ఊఁ కానిమ్ము. చెప్పవేమి భృంగీ!

భృంగి:—నేటియుదయముననే లేచి నేను కాల్యకృత్యముల నిర్వర్తించుకొని జపము జేసికొన సంసిద్ధుడనై......

శంక:—అబ్బా! అనుపయోగవిషయము లెందుల కోయి!

భృంగి:—స్వామీ! దంతధావన మనుపయోగమా? స్నాన మనుపయోగమా? ధ్యాన మనుపయోగమా? పోనిండు. ఏలినవారికీవిషయములు విసువుపుట్టించును కావున మందాకినీసందర్శనము వఱకును జరిగిన మధ్యవిశేషముల జెప్పక కప్పదాటు వైచి యారంభింపు మందురా? అపుడుగాని స్వాముల మనసు చల్లబడదు.

శంక:—(కోపములో) ఊఁ చెప్పవేమి?

భృంగి:—మూడుముక్కలలో ముగించెదను. గగనగంగమ్మతల్లి సఖీసహితముగా నాకు దివ్యదర్శన మొసగి యర్ఘ్యమగుకంటె నధికముగ నాదరించినది.

శంక:—ఔను. ఆమెకు నాపై నధికగౌరవము గలదుగదా. నాపరిజనులలో నగ్రేసరుడ వగుటచే నీకట్టిగౌరవ మొసంగుట సాజమే.

భృంగి:—అదియేనయ్యా! నీకొఱకే- నీ ప్రేమమును సంపాదించుటకే- యామె నన్నంతగ నాదరించిన దని నే నెఱుగ ననుకొంటిరా?

శంక:—నీ కొంబెలసమున కేమ్మిగాని యచట నేమి జరిగినది.

భృంగి:—ఏమి జరిగినది? అంతయు ననుకూలముగ జరిగినది. (మాలిక తీసి) ఇదిగో! ఈసువర్ణ కమలమాలికనామె మీకు మనఃపూర్వకముగా సమర్పించుట జరిగినది. నేను భద్రముగా బట్టుకొనవచ్చుట జరిగినది. ఇదెగో (మాలిక నొసగును.)

శంక:—(అందుకొని) భృంగీ! దీనిని మనము పరిగ్రహింపవచ్చునా ?

భృంగి:—పరిగ్రహించుటో- పరిత్యజించుటో- ఆవిషయము మీయుభయుల యాంతరంగికసంయోగము ననుసరించి యుండును.

శంక:—ఛీ. వాచాలుడా! మేరమీరిన పరిహాసములా ?

భృంగి:—ఏలినవారి చిత్తవృత్తి కీగకాలంబైన భంగకరముగ నేను ప్రసంగించితినా ?

శంక:—భృంగీ! పరిహాసములు మాని చెప్పవోయి! దీని నేమి చేయుమనెదవు ?

భృంగి:—భక్తురాలిగ ప్రస్తుతము గంగ నంగీకరించి పరిగ్రహింపవలసినదే.

శంక:—ప్రస్తుతిమా? ఇకమీద భక్తురాలు గాకపోవునా ?

భృంగి:—ఏమో! అది నేనెట్లు చెప్పగలను? నేటిభక్తి రేపు ప్రణయముగ పరివర్తన మందవచ్చును. ఆమెయునాడు ప్రశయముగా మారవచ్చును.

శంక:—అదికాదు భృంగీ! ఆర్య యీదామమును గాంచిన యనుమాన మందునేమో యని వెనుదీయుచుంటిని.

భృంగి:—ఇంతయనుమానమా గలమహానుభావులిం కెటుపాలింపగలరయ్యా ?

శంక:—పరకాంతనుగూర్చి పరిశీలనము లేకయే ప్రసంగించుచున్నావు. సుమా భృంగీ !

భృంగి:—దివిజగంగ యింకను పరకాంత కాలేదని దేవరమాత్ర మెఱుగరా? ప్రార్థనల నంగీకరించి భక్తురాలి బాలించుట దోషమా?

శంక:—ప్రస్తుత మామె కన్యకయే కావచ్చును. పరుల నెవ్వరినో వరింపదా? అపుడు పరకాంత గాకుండునా? ఇపుడుమాత్రము స్వకాంతయా.

భృంగి:—పరు నెవ్వని నామె వరింపలేదు. పరాత్పరునిమాత్రమే.

శంక:—భృంగీ! ఇటు చూచి యొక్కమాట చెప్పుము. ఈ మాలిక నొసగుచు మందాకిని మనోభావముల నేమైన వెల్లడించినదా? అటులేకానిచో నీవింత సాహసముగా మాటల విసరుదువా! ఏమోయి! మాటాడ వేమి? ఇవన్నియు నీవు నిర్మించిన యూహాసౌధములు కావుగదా.

భృంగి:—చచ్చిచెడి వచ్చితిని మహాత్మా! మిగుల బడలికగా నున్నది. గంగయు నామెసఖియు గావించుకొనిన గూఢప్రసంగమునంతయు ప్రతివాక్యవిమర్శనలతో వెల్లడించుట కిపుడు శక్తిలేదు స్వామీ! ఏదో యింత మృష్టాన్న మారగించి, కాసంత నడుము వాల్చి, ప్రశాంతముగ నొక్కొక్కవిషయమే నెమరునకు దెచ్చుకొనిన గాని నీకు తృప్తిగలుగ నిపుడు భాషింపజాలను. క్షమింపుము.

శంక:—(తనలో) ఆహా!

ఉ. మానససీమ నీదు సుకుమారమనోహరమూర్తి గాంచగా
బూనితి నేని హైమవతిమో ముభయాంతరమందు నిల్చి నా
పై నిశితేక్షణావళి నవారిగ గుప్పినరీతి దోప లో
లోన కృశించుచున్ విధికి లోగుచు నుంటి జమీ సురాపగా!

ఆశాకిరణము లన్నిదెసలనుండియు బ్రసరించుచునే యున్నవి. కాని యేమిలాభము? నీవు ప్రేమతో బంపిన కాంచనకమలమాలికను కంఠమున నలంకరించుకొను భాగ్యమును లేకపోయినది.

(నేపథ్యమున) బాబూ! అమ్మగారు రాలేదా ? యని యాయు ష్మంతులు కుమారవినాయకు లడుగుచున్నారు.

శంక:—ఆఁ ఆఁ విజయా! నేను వచ్చి చెప్పెదనని చెప్పుము. భృంగీ! నీకు భోజనసమయమని యీవఱకే యంటివి గాదా? లెమ్ము.

భృంగి:—చిత్తము. (ఇరువురు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయాంకము-ప్రథమ రంగము

(ప్రదేశము:—మందాకినీతీరము)

(ప్రవేశము:—పార్వతి, తమాల)

పార్వ:—సఖీ! తమాలా! నీ వీతటమున నే నిలువంబడి పురుషు లేరైన వత్తురేమో పరికించుచుండుము. నే నిపుడే స్నాన మాచరించి వచ్చెదను.

(గంగానదిలో దిగబోవును.)

(నేపథ్యమున) ఆగు. కాత్యాయనీ! ఆగుము.

పార్వ:—(దిశల బరికించి) ఎవ్వరే? తమాలా! న న్నాగు మని గంభీరముగ గర్జించుచున్నవారలు?

తమా:—అదిగో నమ్మా! నదినుండి యొకవనితాకృతి బయలువెడలి మనవైపునకే నవ్వుచు వచ్చుచున్నది. చూడుము.

పార్వ:—తమాలా! తమాలా! ఈమెయే! ఈమెయే నే!!

తమా:—ఈమె యేమిటి ?

పార్వ:—ఆనాడు నానాథు నాశ్రయించుకొని నన్నవమానించిన దీమెయే.

తమా:—ఓహో! ఈమెయేనా ?.

గంగ:—(సవిహాసించి) దేవీ! పార్వతీ! ఇట్టి సాహసకృత్యమున కీవే సాహసించుచుంటివా ?

పార్వ:—ఇందు సాహస మేమున్నది?

తమా:—ఫాలలోచనుని యర్ధాంగిని వారించుటలో నీసాహస మే-
తేటపడుచున్నది. ఇందులకు నిన్నే మనవలయునో.

గంగ:—నాయనుమతి కై కొనకయే నాయందవగాహన మొనరింప
బూనుట పరమసాహసము గాదా?

పార్వ:—స్నానము చేయుటకు మున్ను నిన్ను ప్రార్థించి ప్రసన్నను
గావించుకొనవలయునా?

గంగ:—చిరకాలమునుండి సురాసురకోటిచే నొసంగబడుచున్న గౌరవ
విధానమున కీవు నేడు మంగళము పాడదలంచుట మర్యాద యని
యే మానసించితివా?

తమా:—గంగాదేవీ! నీయందు మునిగి, నీజన్మమును పావన మొన
రింప నత్యుచితముగ దయచేసిన యార్యామహాదేవి నుద్దేశించి
యేనా యీ నీ లఘుభాషణములు?

గంగ:—(నవ్వి) ఏసరసిలోనో- ఏతటాకములోనో- లేక కూపము
లోననో స్నానముసేయునభ్యాసము గలదాన వని నేటికి తేటపడినది.
పుణ్యతీర్థములలోని యాచారవిధుల నరయనందుల కీమె దయ
సేయుటయే యగును. (హేళనముగ) ఈమె నన్ను పావన మొనరింప
వచ్చినదట! ఎంత విచిత్రవిషయము! గంగావాహినిని పావకదేవుని
బవిత్రీకరించు నింతవస్తువు నేటి కవతరించినది గాబోలును.

తమా:—పతివ్రతలు గంగనుసైతము పావనమొనరింపగలరను పరమ
రహస్యము నీ వెఱుగకపోవచ్చును.

గంగ:—(వికటముగ) లోకమున బతివ్రతలు కానివా రెవ్వరు? ఈపతి-
వ్రతాశిరోమణులు నాపై గాలుమోపి, నన్ను కలచి, నానాశ్రమల-
పాలుచేసి, తుదకు మాటలచే మనసుచే శుద్ధిచేయు మని యర్థింప
లేదు గదా. ఎందుల కీపిలువని పేరంటము? అందులో మఱియొక
విశేషము. భర్తగారిపుంస్త్వమున నర్ధభాగము హరించినమహాసతి
స న్నుద్ధరించు నట!

పార్వ:—అంతరువుల నెఱుగకుండ నధికప్రసంగము చేయుచున్నావు. నేను స్నాన మాచరింపక యూరక మఱలుదాన ననుకొంటివా ? కానిమ్ము. నన్నెటులు వారింపగలవో చూచెదను.

గంగ:—సామవాక్యములచే సాధింపదగినకార్యము ఖడ్గవాదముతో నారంభించిన నడలిపోయి యళుగులకు మఱుగు లొగ్గుట కిది కైలాసము కాదు. నన్ను పవిత్రి మొనరింప విచ్చేసితిరా? అబ్బా! ఏమి పరోపకారపారీణత ! ఏమి నిర్హేతుకజాయమానకరుణ ! సంతసించితిని. ఇక వెనుకకు దయచేయుడు. నా యధికారమున.....

తమా:—కొట్టుట కధికారము లేకపోవచ్చునుగాని పెట్టుట కెందులకు?

పార్వ:—(సఖ నపవారించి) తమాలా! నీవు మాటలాడవలదు. (గంగతో) దివిజవాహినీ! నీవు ముందువెనుక లాలోచించుకొనియే యిటు పల్కుచున్నావా! లేక పరిహాసమునకా!

గంగ:—పరిహాసించుట కంత వావివరుసల నెఱుంగనిదానను గాను.

పార్వ:—(మెల్లగ) తమాలా! గ్రహించితివా! ఆమాటలలోని యంతరార్థమును ?

తమా:—ఔ నమ్మా ! కొంత యనుమానమునకు తావొసంగుచున్నవి.

పార్వ:—నీకును నాకును వావి యేమి? సంబంధ మేమున్నది ?

గంగ:—ఏమి కలదో తెలియదా ? ఒకవిధమగు పూర్వబాంధవ్యమున్నది. ఇపు డది యించుక బలీయము గానున్నది.

పార్వ:—తమాలా! వినుచున్నావా? తీగలాగుసరికి డొంక యెంతగ గదలుచున్నదో.

తమా:—సంబంధ మేమని సాగదీసి యడుగ వేమమ్మా !

గంగ:—మీా రటులు గుజగుజలు వోవు టెందులకు? సంబంధబాంధవ్యములగూర్చి చెలికత్తె చెవుల గొఱుకుట లెందులకు? మనయను

బంధముమాట నటుంచి ముందు మీా రిట కేసంబంధ మున్న దని దయచేసినారో చెప్పరాదా ?

పార్వ:—మాకార్యము నెర వేర్చుకొనుటకు.

గంగ:—(నగుచు) అంతియే కాని న న్ననుగ్రహించుటకు గాదుగదా!

పార్వ:—(సగర్వముగ) ఆఁ ని న్ననుగ్రహించుటకుగూడను.

గంగ:—భవానీదేవి పలికి బొంకనిదని నే నిపుడు నిశ్చయించుకొనవచ్చునా ?

తమా:—దేవీ! దేవీ! నీ వేమి యీ నమాయికపరిసంగము సేసి ప్రాణములమీాదకు తెచ్చెదవేమో సుమా! ఈ మాయావిని మనల బంధించుటకు మంచిమంచి యుచ్చుల బన్నుచున్నది.

గంగ:—చెలికత్తె గుసగుసల కా తలయూపు లెందులకు? నన్నడుగరాదా ? ఈ గుడుగుడుగుంచము లెందులకు? ఈముసుగులో గ్రుద్దులాట లెందులకు? ధారాళముగ బ్రశ్నింపరాదా ?

పార్వ:—(కోపముతో) నీవలె నేను వక్రవర్తన మెఱుగను. మన్మథిక్షేపించుటకు జడమూర్తి కెంత చాకచక్యము వచ్చినది. నీమాటలలోనే నీ నీచప్రచారము వెల్లడి యగుచున్నది.

గంగ:—నావి నీచపరిచారములు, నీవి సరససంభాషణములునా ? ఓహోహో! భక్తపరాధీన! పతితపావనాచరణప్రవీణ! భవానీదేవీ! పరమపాపిని యగు సురవాహినిని సంస్కరించు సదుద్దేశముతో జక్కవచ్చితివే. అంతగౌరవమున కర్హురాలను గాను. నీ సత్సంకల్పమునకు సహస్రవందనములు. ఇక ప్రయాణభేరిక మోగింపవచ్చును.

పార్వ:—(కోపముతో) సరసాంతరంగ వని సంభావించి సామవచనము లింతదనుక నుడివినందులకు పశ్చాత్తాప మందుచుంటిని. పరమేశ్వరునిల్లాలి నొక జడస్వాభిని వారించునదియా? నాపరిభావ

మించుక చవిజూడఁబలయు ననుకోరిక యున్న నేదీ నన్నడ్డుకొనుము. (ముందునకు బోవును.)

(గంగ జలసహితముగ నంతర్హిత మందును.)

తమా:—అమ్మా!అమ్మా! చూచితివా! మనల కనుబొమ్మి యెంతలో నదృశ్యమైనదో. ఇకముం దీగంగ కేమి కనిపెట్టుకొనియున్నదో?

పార్వ:—(పెదవి కొఱికి) ఈగంగ కింతయహంకారము గలుగుటకు నీమె యింత తెగించి తెయితక్క లాడుటకును, నా కైలాసపతియే కారణము గాని వేఱు గాదు. కానిమ్ము. దీనికి దగుప్రతీకార మాచరింపకుందునా? రావే తమాలా ! రావే.

(ఇరువురును నిష్క్రమింతురు.)

## ద్వితీయాంకము-ద్వితీయ రంగము

(ప్రదేశము:—హిమాలయప్రాంతము)

(ప్రవేశము:—భగీరథుఁడు (సమాధిమగ్నుఁడై)

(గంగ ప్రత్యక్ష మగును.)

గంగ:—వత్సా! భగీరథా! లెమ్ము.

భగీ:—(కనుల దెరచి) ఆహాహా! నేటితో నాజన్మము తరించినది. నా వంశము తరించినది. కృతార్థుడ నైతిని. తల్లీ! సురకల్లోలినీమతల్లీ! దయ వచ్చినదా? దాసుని ధన్యు నొనరింప దయచేసితివా. జయ జయ గంగే!- మంగళతరంగే!

గంగ:—సర్వశక్తిమంతులై చరాచరముల సృష్టిస్థితిలయములకు గారణభూతు లగువిధిని, హరిని, హరుని దర్శింప తప మొనరింపవలయునే కాని యబల నగు నన్నావాహనము గావించితివేల నయ్యా! భగీరథా !

భగీ:—అవని కవతరించి మాసాగరుల శ్మశానావని బ్రవహించి వారి దరింప జేయుశక్తి నీకుగాక యితరుల కేరికి గలదు? జననీ!

గంగ:—రాజర్షి శేఖరా! నీకోరికను వెల్లడించితివి కా...ని.

భగీ:—సందేహించుచుంటివా? తల్లీ! సందేహించుచుంటివా? ఇంకను దయ రాలేదా? నాపూజలలో నేమైన కొఱంత గల్గినదా? నాతపము నీమానసమును కరగింపలేకపోయినదా? మాపితరులు సగర పుత్త్రుల శ్మశానావనిపై నొక్కసారి ప్రవహించి వారి కుత్తర గతుల గల్పింపవా?

గంగ:—ఆ విషయముననే గొప్పయవరోధ మున్నదని చెప్పుచుంటిని కాదా భగీరథా!

భగీ:—అమ్మా! ఆయాటంక మేదియో నేను తెలుసుకొనవచ్చునా? నాశక్తికి మించనిపని యైనచో దానినిగూడ సాధించి పితృదేవతల కింతసేవ జేసినవాడ నగుదును. తల్లీ! దయయుంచి దాని నానతిచ్చెదవా?

గంగ:—వత్సా:—నీ నిశ్చలతపము త్రిమూర్తులనైత మవలీలగ బ్రసన్నుల గావింపగలదు. సందియము లేదు.

భగీ:—అమ్మా! ఆ యవరోధములో బాటుగ కర్తవ్యమునుగూడ యీ నీతనయునకు బోధింపరాదా?

గంగ:—రాజర్షి పుంగవా! నీకోరికను మన్నించి నేను భూమి కవతరించుట కెట్టియభ్యంతరమును లేదు. కాని నా మహాప్రవాహము నది భరింపగలదా? అంతయెత్తునుండి యవనీతలమున దుమికినపుడు సమస్తచరాచరములును సమసిపోవా? కావున నీ వొకమహత్తర కార్యము నాచరింపవలసియున్నది.

భగీ:—సేవకుడు సర్వసంసిద్ధుడని తొలుతనే విన్నవించుకొంటినిగాదా ఈ దీనదీను నెట్టిపనికైన నియోగించి సాగరుల కింతసద్గతిని బ్రసాదింపుము తల్లీ!

గంగ:—అంతటి యున్నతప్రదేశమునుండి దుముకునన్ను తొలుత శిరము నొగ్గి ధరించి ప్రవాహవేగము నరికట్టి యాపిమ్మట క్రొల దిగ భూతలమున మెల్లగ విడువగల సమర్థు డెవ్వడైన నుండ వలయును.

భగీ:—తల్లీ! అట్లైన తామరసాక్షునిగూర్చి తపింపుమనియాజ్ఞయా?

గంగ:—వలదు భగీరథా! వలదు. పద్మలోచనుని పాదముల బ్రభవించిన నేను పరమపావనమగు జనకునిశిరముపై పడమానుట తగునా? అది ధర్మవిరుద్ధము!

భగీ:—అట్లైన వాణీవల్లభుడు...

గంగ:—వత్సా! పితామహుని నందుపై సురజ్యేష్ఠుని బేర్కొంటివే. అగ్రాసనమున నామహాత్ము నుంచి పూజింపవలయునే కాని నిత్య సృష్టికర్మములనుండి విముఖునిగావించి యాయసకిట్టి శ్రమ నొసంగ నగునా?

భగీ:—జననీ! సురాసురకోటిలో నిన్నిక భరింప శక్తిమంతు లెవ్వరు గలరు? ఆ మహేశ్వరుడు దక్క...

గంగ:—(నగుచు) ఔను. చక్కగ సూచించితివి. ఔను. ఆ ఫాలలోచను డొక్కడే నన్ను భరింప సమర్థుడు. అతని నంగీకరింప జేయుట యంత తేలిక గాదేమో.

భగీ:—అటు లందువేమి తల్లీ! పరమేశ్వరుడు భక్తజనసులభు డని విందుమే. నీ వాశీర్వదించి పంపినచో నాకు జయ మనాయాసముగ లభింప కేమి?

గంగ:—మంచిది. వత్సా! మంచిది. ఇటు చూడు భగీరథా! ఒక్క మాట చెప్పుము. మీపితృసద్గతికై న న్నారాధింపు మని యెవ్వరైన నీకు బోధించిరా? లేక సకలధర్మవేది వగునీకే తోచినదా?

భగీ:—నీశక్తి నెఱుగ నేనెంతవాడను తల్లీ! నాభాగ్యవశమున వైకుంఠమునుండి వేంచేసిన నారదమునీంద్రులు నా కీసదుపదేశ మొసరించినారు.

గంగ:—(తనలో) ఆహా! సర్వాంతర్యామి యగు నాజనకుడె నాకోరిక నెఱిగి నారదునిచే నీ భగీరథుని తపమున కాయత్త మొనరింపజేసి యుండును. గంగాశంకరకల్యాణ నాటకమున కపుడే నారదమహర్షి నాందీపూజ నారంభించినాడు.

శా. సాంగోపాంగము వేదముం గరచి బ్రహ్మజ్ఞానివై సాధులో
కాంగీకారము గాగ లౌకికవిశేషాలాపముల్ నేర్చి యె
బ్బంగిం బూజల గాంచునారదుడె ప్రాపై యుండె నీయండ నో
గంగా! నీవ యదృష్టశాలినివి నీకార్యమ్ము సిద్ధింపదే.

భగీ:—జననీ! పుత్రున కింకేమైన బోధింప నెంతువా?

గంగ:—వత్సా! నీకు వేఱుగ బోధింపవలయునా?

భగీ:—జననీ! నీ వాశాసించి నాకు బలమొసంగుము.(నమస్కరించును)

గంగ:—అభీష్టసిద్ధి రస్తు. వత్సా! సుఖముగ నుండుము.

(అదృశ్యత నందును.)

(తెర వ్రాలును.)

---

ద్వితీయాంకము:—తృతీయరంగము.

(ప్రదేశము:—కైలాసము)

(ప్రవేశము:—శంకరుడు, పార్వతి, బృహస్పతి

పార్వ:—దేవగురూత్తమా! అపుడు కిన్నరకింపురుషుల విప్లవ మెట్లు శమించినది? శచీనాథుని వజ్రాయుధమునకు పదను పెట్టవలసివచ్చినదికాబోలును.

బృహ:—అమ్మా! అంతవని కమరనాథు డాయత్తుడైనాడు. కాని దానివలన శాంతికిమాఱుగ మరింతవిప్లవము చెలరేగు ననియు, నది యాధారముగ గైకొని బలిచక్రివర్తి దేవతల ననాయాసముగ జయింపగల డనియు నేను బోధించి దారుణకర్మకు విముఖుని గావించితిని.

శంక:—అటులైన సామోపాయముచేతనే సంరంభమును జక్కబఱచిరా?

బృహ:—చిత్తము. అంతకంటె మార్గాంతర మేమున్నది? విప్లవకారులలో ప్రముఖులగువారిని సగౌరవంబుగ రావించి సభాముఖంబున వారికి సంతృప్తి గల్గించితిమి.

పార్వ:—ఏమి? ఏవిధముగ?

బృహ:—పుణ్యదంపతులారా! అవధరింపుడు.

సీ. శూలినామము మహేశునకు పూనగాలేదె?
అంబికాదేవి శివాఖ్య గొనదె?
యమునకు పితృపతి యనెడినామము లేదె?
కుసుమసాయకు ననంగు డని యనమె?
అఖిలలోకస్రష్ట యజనామ మందడే
యనిలనామము వాయు వందలేదె?
స్వారాజు పాకశాసను డంచు బిలువమే
హరిం బుండరీకాక్షు డనుటలేదె?

గీ. పూతనామంబుల కపార్థములను దుష్ట
పాండితీగతి గల్పింపవచ్చుగాక
కింపురుషపాళి కిన్నరాగ్రేసరాళి
పరులదుర్బోధలకు గిన్క వడయ నగునె?

అని యీరీతిగ మహోపన్యాసము గావించితిని. కార్యానుకూలతకై కైలాసనాథులగూడ ప్రస్తావింపవలసివచ్చినందులకు క్షంతవ్యుడను.

శంక:—(నవ్వి) నేను శూల గలవాడను. దేవీ! నీవు జంబుకివి.

పార్వ:—(నవ్వి) అల్పసంతోషు లగువా రీవాక్యములతో కోపము చల్లార్చుకొనిరి గాబోలును.

బృహ:—ఔను. తల్లీ! అంతటితో నాయల్పులయార్భటులు శమించినవి. అమరులలో నైకమత్యము మఱల వృద్ధినందినది. కాని...

శంక:—మునీంద్రా! "కాని." యనుచున్నారు. నాకలోకమును జీకాకుపఱచు ప్రమాదాంతర మేదియైన బ్రభవించినదా?

బృహ:—దేవా! నీవెఱుంగని దేమున్నది? దుర్వాసోమునిసింహుని దుర్వార శాపము.

పార్వ:—ఏ మున్నది? సురగురూత్తమా? అట్టిసంఘటన మేమి?

బృహ:—ఏమని చెప్పుమనెదవు తల్లీ! అమరేంద్రు డొకనా డైరావత మధిష్ఠించి వాహ్యాళి వెడలుచుండ దుర్వాసు డెదురైనాడు. అమరావతియభాగ్య మొక్కమారుగ మూర్తీభవించి యాతనివేయి కన్నుల గప్పివేయుటచే నింద్రుడు కరి నవతరించి మునీంద్రుని పూజింపలేదు సరిగదా యావంకైన జూడలేదు.

పార్వ:—అయ్యో! అయ్యో! పూజ్యపాదులయెడ పురందరు డెంతయ విధేయత బ్రదర్శించినాడు!

బృహ:—అంతటికోపియు నప్పటికిని కినియక తన కొకకిన్నరాంగన భక్తితో సమర్పించిన సుమదామమును శచీనాథునకు క్రిందనుండియే యందించినాడట!

శంక:—శిఖికి శీతలత్వము చేకూరిన దే. వజ్రమునకు పరమపేశలత వెలిసిన దే- ఇది విచిత్రవిషయమే.

పార్వ:—ఉప్పెనకు ముందుగ నుదధి నిస్తరంగ మగునుగాదా. ముందునకు దుముక నెంచువాత డొకింత వెనుకకు దగ్గకుండునా?

# జయతు సంస్కృతమ్

శ్రీ కాళూరి హనుమంతరావు.

శిశువు చెంత నుండ వెస సంభ్రమించుచు, మాత వెదకునట్టిరీతి నేను
కలుగసంస్కృతమ్ము చెలరేగె నధికార, భాషకొఱకు గడు గవేషణమ్ము.
దివమునుండి మనదు దేశమునకువచ్చె, జాహ్నవీనదియునుసంస్కృతమును
సారతనము మనదు సాహితీక్షేత్రము, తద్వచోనదీపదాంబువులను.

సకలభరతభాషలకు మాత సర్వభా, షావిశారద పరిశంసితమ్ము
బహుళయోగికార్థ, బహువిధార్థవ్యక్తి, శక్తియుక్త క్రమశబ్దనివహ.
జ్ఞానవార్ధి సకలశాస్త్రమహాఖని, భరతసంస్కృతికిని ప్రాణశక్తి
నాదు సంస్కృతమనునావభారతశాస్త్ర, సంచయముపగ్రహించెదిశల.

వ్రాయుకలము తుహినపర్వతమ్మును జేసి, చేసి జలనిధిని మషీద్రవమ్ము
అవనిపత్రమందునైన ననంతముల్, తత్ఫలముల వ్రాయ దరము కాదు.

చ. పురుషులయందు రాముడును
భూసుత యోషితలందు, నంజనా
వరతనయుండు సర్వబల
వంతులయందు, వదాన్యులం దుశీ
నరపతి, సత్కవీశ్వరగ
ణమ్మున నాకభవుండు, నెట్లొకొ
క్కరు తమజాతి నుత్తములో
యట్టులె సంస్కృత మెల్లభాషలన్.

తే. గీ. సంస్కృత మ్మగుగావుత సాంప్రతమ్ము
నస్మదధికారభాష; సమస్తభార
తమ్ము నేకహృదయ మయి తనరుఁగాత
సకలభాషావిరోధమ్ము సమయుఁగాత!



# సంపాదకీయము

శ్రీ మత్ప్లవంగనామవత్సర చైత్రమాసపత్రికాషట్క మిద్దానితో నిర్విఘ్నముగ బూర్తిపరిచరణము గావింపఁబడినది. వ్యాసరచయితలు, పద్యకవయితలును, సారోదారము లగు తమరచనల సకాలమున బంపినందుల కాంధ్రసాహిత్యపరిషత్తు దన కృతజ్ఞతాభినందనములఁ దద్విద్వన్మండలి కర్పించుచున్నది.

శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువుయొక్క సశేషసప్తమసంపుటముగూడ గొలదినెలలలో బూర్ణముద్రణము గావింపఁబడి యాంధ్రభాషాభిమానజనతాహస్తంగతము గాఁబోవుచున్న దని మనవి నొనరించుచుంటిమి.

శ్రీ మత్కీలకసంవత్సరమునఁగూడ పండితకవిమండలి ససారప్రౌఢరచనాప్రేషణములచే నాంధ్రసాహిత్యపరిషద్గౌరవోన్నతి నభివృద్ధి గావింప బ్రార్థితము. ఆంధ్రగీర్వాణభాషాభిమాను లగు పాఠకమహాశయు లెల్లలును బత్రికాస్వీకృతికై పరిషత్సభ్యత గొని యాంధ్రదేశీయగౌరవాభివృద్ధిఁ గావించెదరుగాక.

ఇట్లు,

సంపాదకుఁడు; కవిమూర్ధన్య, కాకరపర్తి కృష్ణశాస్త్రి.

సంపాదకసహాయులు,

(1) దంతులూరి సుబ్బరాజు (ఎం. ఏ.)

(2) విద్వాన్ గున్నేపల్లి అక్షయలింగకవి.

# శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

| | | | | | |
|---|---|---|---|---|---|
| *1 | సంపుటము | ... | ... | ... | 15-00 |
| *2 | ,, | ... | ... | ... | 15-00 |
| 3 | ,, | ... | ... | ... | 15-00 |
| 4 | ,, | ... | ... | ... | 15-00 |
| 5 | ,, | ... | ... | ... | 15-00 |
| 6 | ,, | ... | ... | ... | 15-00 |
| 7 | ,, | ... | ... | ... | 15-00 |

* పునర్ముద్రితములు గానున్నవి.

Note:-7వ సంపుటములో ననుబంధము (శ, ష, స, హ)లు ముద్రిత మగుచున్నవి.

ప్రతులకు :

ఆంధ్ర సాహిత్య పరిషత్తు (రిజిష్టర్డు)

రామారావుపేట

కాకినాడ

Edited by K. Krishnasastry, Published by Andhra Sahitya Parishat and Printed by J. Bhaskara Rao at Republic Press Main Road, Kakinada.